# 1808-1843 నాటి నిజాం రాజ్య చరిత్రలోని చిత్రకథలు 1

రచన: దిగవల్లి వేంకట శివరావు

డిసెంబర్ 2020

## ఆంధ్రుల చరిత్రలో వెలుగుచూడని కొన్ని ఘట్టాలు 1: చందూలాల్ వంశ చరిత్ర

మొగలు చక్రవర్తియైన అక్బరు పాదుషాగారి దగ్గర రాజస్వ(రివిన్యూ) మంత్రిగా చరిత్రప్రసిద్ధుడైన మహారాజా తోడర్‌మల్లు వంశీయులైన ఖత్రి కులమువారమని చందులాల్‌గారు చెప్పేవారు.

తోడరుమల్లుగారికి అయిదవతరమువాడైన రాయ్ మూల్చందుగారు హైదరాబాదుకు నిజాముల్‌ముల్కు దక్కను సుబేదారుగా వచ్చినప్పుడు మాలవదేశం నుంచి వారితో వచ్చాడు. ఆయన సాయరు సుంకములు (excise) అబుకారీ శాఖకు అధ్యక్షత వహించే ఉద్యోగిగా నియమించబడినాడు. ఆయన కుమారుడు రాయ్ లక్ష్మీరామ్‌గారు కూడా ఆ ఉద్యోగం చేశారు. ఆయనకు నానకురామ్, రాయ్ నారాయణదాసు అనే ఇద్దరు కుమాళ్లు. నానకురాముగారు తండ్రి ఉద్యోగానికి వారసుడైనాడు. రాయ్ నారాయణదాసుగారికి చందులాల్ గోవిందబక్షు అని ఇద్దరు కుమాళ్లు. చందులాల్‌గారు సింధియా రాజుగారి కొలువులో ఉన్న బుర్హాన్‌పూరు ప్రభువైన విఠల్‌రాయిగారి కొమార్తెను వివాహమాడినాడు. చందులాలుగారికి బాలప్రసాదు అనే కుమారుడు, ఒక కుమార్తె, నానకుబక్షు అనే చిన్నకుమారుడు కలిగినారు. బాలప్రసాదుకు నారాయణ బహద్దూరనే కుమారుడు కలిగినాడు. ఆయన కొమార్తె కొడుకే ఏడవ నిజాము ఉస్మానాలీఖానుగారి దగ్గర మంత్రిగా కార్యనిర్వాహక మండలి అధ్యక్షుడుగా నుండిన మహారాజా కిషన్‌ప్రసాద్ బహద్దరుగారు.

మహారాజా చందులాల్ మొదట హైదరాబాదు రాజ్యంలో సాయరు అబుకారీ శాఖలో చిన్న ఉద్యోగం చేశారు. తరువాత ఆ శాఖకు అధిపతియైనారు. 1797వ సం.లో ఆ ఉద్యోగం

మానుకున్నారు. ఆ సమయంలో ఇంగ్లీషు కంపెనీవారికి టిప్పుసుల్తానుగారితో జరిగిన యుద్ధములో బళ్లారి కడప గుత్తి జిల్లాలు నిజాముగారి వాటాక్రింద పంచియివ్వగా వానిని పరిపాలించుటకు చందులాల్‌గారు నియమింపబడిరి. ఆ తరువాత ఆ జిల్లాలను నిజాము 1800 సం.లో సైనిక ఖర్చులక్రింద ఇంగ్లీషువారికివ్వగా అవి దత్తమండలములని వ్యవహరింపబడినవి. మహారాజా చందులాలుగారు నిజాముగారి ప్రధానమంత్రికి సహాయకుడై 1806 సం.లో దివానుపేష్కారుగా నియమింపబడినా ఆయన సర్వాధికారాలుగల మంత్రిగానుండేవాడు. ఆయన 1843 సం.లో పదవిని విరమించగానే నెలకు 30,000 రూపాయల పింఛను ఇచ్చారు. ఆయన 1846 ఏప్రిలు 15వ తేదీన దివంగతుడైనారు.

## మహారాజా చందూలాల్ దివాన్గిరీ

ఇంగ్లీషు వర్తక కంపెనీవారి వలలో చిక్కి ఉత్తర సర్కారులను రాయలసీమను వారికి కట్టబెట్టిన హైదరాబాద్ నవాబు నిజామలీఖాన్ 6-8-1803 తేదీన చనిపోవగా ఆయన కుమారుడైన సికందర్‌జా నవాబయ్యెను.

హైదరాబాద్ నవాబు మొదట హిందూదేశమునేలు మొగలు చక్రవర్తికి ప్రతినిధిగా దక్షిణాపథ రాజ్యములను పరిపాలించుటకు నియమింపబడి దక్కను సుబేదారుడని వ్యవహరింపబడుచుండిన నిజాముల్ ముల్కు నంతతివాడు. నిజాముల్ ముల్కు పేరునకు దక్కను సుబేదారుడుగనున్నను 1724 నుండి స్వతంత్రుడుగనే వ్యవహరించుచుండెను. 1803 నాటికి మొగలు చక్రవర్తియొక్క సామ్రాజ్యమంతరించెను. మహారాష్ట్రులు ఇంగ్లీషువారు బలవంతులై యుండిరి. ఆనాటి ఢిల్లీ పాదుషా షాఆలం పేరునకు మాత్రమే చక్రవర్తి. ఆయనకు పూర్వపు రాజలాంఛనములు మర్యాదలు మాత్రము జరుగుచుండెను.

సికందరుజాకూడా తన పూర్వులవలెనే తన దక్కను సుబేదారీని ఢిల్లీ పాదుషాచేత ఖాయపరిపించుకొను ప్రహసనమును జరిపెను. తనతండ్రి ఇంగ్లీషుకంపెనీవారితో చేసుకొనిన సంధి యేర్పాటులనన్నిటిని స్థిరపరచెను. ఆ సంధి షరతుల ప్రకారము నవాబుగారికి

సహాయముచేయుటకను మిషతో ఇంగ్లీషువారు ఆరు పటాలముల సైన్యమును హైదరాబాదులోనుంచిరి. వారి ప్రతినిధియైన రెసిడెంటు హైదరాబాద్‌లో కాపురముండి ఇక్కడి వ్యవహారములనెప్పటికప్పుడు కలకత్తాలోని గవర్నరు జనరలుకు తెలియపరచుచుండును.

హైదరాబాద్ నవాబుగారికి కూడా ప్రత్యేక సైన్యమున్నను అది క్రమశిక్షణము పొందినట్టిదికాదు. అందువలన దానికి కూడా ఇంగ్లీషు ఉద్యోగులను నియమించుట అవసరముగనుండెను. కంపెనీవారు క్రమక్రమముగా బలవంతులగుచుండిరి. అన్ని విషయములందును నవాబుగారు వారిపైన ఆధారపడవలసిన దుస్థితి కలుగుచుండెను. బలవంతులగు నీఇంగ్లీషువారికి కోపమువచ్చినచో నేమిచేయుదురో అను భయము నవాబుగారికిని, వారి మంత్రులకునుండెను. నవాబుగారి మంత్రులు ఇంగ్లీషు రెసిడెంటుగారిపట్ల వినయవిధేయతలు కలిగి, వారి కనుసన్నల మెలగవలసినవారైరి. సికందరుజా నవాబగునప్పటికి మీర్ ఆలం ప్రధానమంత్రిగనుండెను. అతడు సమర్థుడేగాక ఇంగ్లీషువారికి అనుకూలుడుగమండెను. అందువలన రాజకార్యములు ఇంగ్లీషువారికి అనుకూలముగ వారి ఇష్టానుసారముగా జరుగుచుండెను. మీర్ ఆలం 1808లో చనిపోవగా ఆయన అల్లుడైన మునిర్ ఉల్ ముల్కుగారును సంస్థాన సైనికపక్షమువారి నాయకుడగు షమ్సుల్ ఉమ్రాగారును ప్రధానమంత్రి పదవినపేక్షించి పోటీపడిరి. ఈ విషయములో నవాబుగారు గవర్నరు జనరలైన మింటోగారి అభిప్రాయమును తెలిసికొనగోరిరి. మింటోగారు షమ్సుల్ ఉమ్రాను నియమించిన బాగుండుననిరి. అయితే నవాబుగారికిది యిష్టములేదు. ఇంగ్లీషువారిని సంతృప్తిపరచుటకై అప్పటికే దివాను పేష్కారుగా నుండి వారికనుకూలుడుగనుండిన రాజాచందులాల్‌గారి సలహా సహాయములతో అన్ని పనులను ఆయన కృతముగానే జరిపించు పద్ధతితో మునిర్ ఉల్ ముల్కుగారిని ప్రధానమంత్రిగా నియమించిరి. ఇంగ్లీషువారు దీనికంగీకరించిరి. సికందర్ జా సుఖలోలుడై భోగవిలాసములందు మునిగి రాజకార్యముల పట్ల శ్రద్ధ వహింపక సంస్థాన పరిపాలనమును దివాను పేష్కారుగారికిని, ప్రధానమంత్రికిని వదలివేసిరి.

రాజాచందూలాల్‌గారు ఖత్రీ అను క్షత్రియకులమువారు. వ్రాతకోతలందు లెక్కలందు ప్రవీణులు. హిందూరాజుల క్రిందను మహమ్మదీయ ప్రభువుల క్రిందను రాజోద్యోగులుగా పనిచేయువారు. చందులాల్ గారి పూర్వులు మొదట 1724లో నిజాముల్ ముల్కుగారితో ఢిల్లీ నుండి హైదరాబాద్‌కు వచ్చిరి. రాజాచందులాల్‌గారు 1776లో జన్మించిరి. ఆయనకు చాలా భాషలు వచ్చును. ఆయన పారసీ ఉర్దూ భాషలలో కవిత్వము చెప్పుచుండెను. ఆయన రచించిన గజల్ అను పద్యముల సంపుటి యొక్కటి ముద్రింపబడి యున్నది. చందులాల్‌గారు దివాన్ పేష్కారుగా ముప్పదేండ్లపై కాలము సమర్థతతో పనిచేసిరి. ఆయన కాలములో హైదరాబాద్ రాజకీయ ఆర్థిక వ్యవహారములందనేక చిక్కులు కలిగెను. వానినన్నిటిని ఆయన ధైర్యముతో ఎదుర్కొని పరిష్కరించెను. దివాను పేష్కారు పని సులభమైనదికాదు. ఒక వంక నిజాముగారికిని ఇంకొక వంక కంపెనీవారికిని గూడా తృప్తికరముగా పనిచేయవలెను. చందులాల్‌గారు ఇంగ్లీషు రెసిడెంట్లు అందరితోను స్నేహముగా నుండి వారి గౌరవమునకు పాత్రుడయ్యెను.

రాజాచందులాల్‌గారు దివాన్ పేష్కారగు నాటికి సంస్థానము యొక్క ఆదాయము సరిగా వసూలగుటలేదు. భూములన్నియు జాగీరుదారుల క్రింద నుండెను. జాగీరుదారులు చాల బలవంతులై సర్కారుకు చెల్లించవలసిన పేష్కషు బాకీలు పెట్టుచుండిరి. భూమి శిస్తు వసూలుచేయు హక్కును, పన్నులు వసూలుచేయు హక్కులును ఇజారాలకిచ్చుట ఆచారముగనుండెను. ఇజారాదారులు ప్రజలను పీడించుచుండిరి. జాగీరుదారులు శాంతిభద్రతలు కాపాడలేకుండిరి. ప్రజల బాధలు మితిమీరెను. బలవంతులు తిరుగుబాటు చేయుచుండిరి. అల్లరులు తిరుగుబాటులు అణచుటకు సైన్యమునంపవలసి వచ్చుచుండెను. హైదరాబాదు ప్రభుత్వమువారు ఇంగ్లీషు సైనికులకు జీతబత్తెములివ్వవలసి వచ్చుటవలనను, సంస్థానములోని అల్లరుల నణచుటకు నియమించు సామాన్య సైనికుల జీతబత్తెములు చెల్లించవలసి యున్నందునను సైనిక వ్యయము పెరిగిపోవుచుండెను. సామాన్య పరిపాలన ఖర్చులకు సొమ్ము చాలకుండెను.

1818లో మహారాష్ట్ర యుద్ధానంతరము గవర్నరు జనరలు ఇంగ్లీషు సహాయక రక్షణపై వ్యయము తగ్గించుటకు, గుర్రపుదళము, కాల్బలము, ఫిరంగి మందుగుండు దళములు అన్నియు కలిపిన మూలబలములను పదివేలకు తగ్గించెను. అయితే చందులాలుగారు తమ సంస్థానములో శాంతిభద్రతలకని సామాన్య (ఇరెగ్యులర్) ఆయుధ జనమును ముందు వెనుక ఆలోచింపక పెంచుచు వానిని ఇంగ్లీషు సైనిక దళాధిపతుల క్రిందనుంచు ఏర్పాటు చేసెను. దీనివలన సైనిక వ్యయము పెరిగెను. సంస్థానాదాయము చాలక ఋణములు చేయవలసివచ్చుచుండెను. హైదరాబాద్ రెసిడెంటగు (సర్) చార్లెస్ మెట్కాఫ్‌గారు సంస్థానములోని ఆర్థిక పరిస్థితులను పరికించుటకు, 1820లో సంస్థానములో పర్యటనము చేసిచూడగా దేశము దుస్థితిలో నుండుట కనబడెను. జాగీరుదారులు జమీందారులు బలవంతులుగానుండి ఒండొరులతో కలహించి పరిసర గ్రామములు కొల్లపెట్టుచుండిరి. దేశములో దారిదోపిడిగాండ్రు చెలరేగి హత్యలు చేయుచుండిరి. రాజబాటలపైన రాకపోకలు రవాణాలు ఆయుధజనుల సహాయము లేనిది జరుగుట దుర్లభమయ్యెను. దేశములో శాంతిభద్రతలు క్రమపరిపాలనము లేకుండెను. నిజాము రాజ్యములోని యుద్యోగులు లంచగొండులుగను అసమర్థులుగను ఉండిరి. శిస్తులు పన్నులు విర్ణయించుటలో క్రమపద్ధతి లేకుండెను. అందువలన దేశములో శాంతిభద్రతలను కాపాడి క్రమపరిపాలనము జరుపుటకు ప్రతి జిల్లాలోను ఇంగ్లీషు ఉద్యోగులను నియమించిన బాగుండునని ఆయన చందులాల్‌గారితో చెప్పగా ఆయన కూడా దీని కంగీకరించెను. ఈ యుద్యోగుల జీతబత్తెములు సంస్థానమువారు చెల్లించు పద్ధతిని ఇంగ్లీషు దొరలు నియమింపబడిరి. వారు త్వరలోనే శాంతిభద్రతలు క్రమపరిపాలనమును స్థాపించి, శిస్తులను నిర్ణయించి వానిని ఖచ్చితముగా వసూలుచేయసాగిరి. పూర్వము లాభము పొందుచుండిన ఇజారాదారులకు లంచగొండులగు ఉద్యోగులకు ఈ క్రొత్త విధానము వలన నష్టము కలిగినందువలన వారు లేనిపోని చాడీలు చెప్పుచు దుష్ప్రచారము చేయసాగిరి. వారెంత ప్రయత్నించినను సికందరుజాగారు 1829లో చనిపోవువరకును ఈ విధానమున మార్పు జరుగలేదు. ఇంగ్లీషువారికి చెల్లించవలసిన సైనిక వ్యయఖర్చులు చెల్లించి సక్రమ పరిపాలనము జరుపుదునని క్రొత్త నవాబుగారివలన వాగ్దానము చేయించుకొని ఆ దొరలను తొలగించిరి. ఇంగ్లీషు ఉద్యోగులు తొలగుటయే తడవుగా దేశములో మరల అశాంతియు అల్లకల్లోలమును

చెలరేగెను. ఇంగ్లీషు ప్రభుత్వమువారు చేసిన వాగ్దానము ప్రకారము వారు సంస్థానము యొక్క ఆంతరంగిక పరిపాలనమునందు జోక్యము కలిగించుకొనకుండిరి. అందువలన సంస్థానములోని పరిస్థితులు మరింత పాడయ్యెను. నిజాముగారికిష్టమైన దివానుని నియమించుకొనవచ్చునని ఇంగ్లీషువారు చెప్పినను, చందులాల్‌గారిని తీసివేసి మరియొకరిని నియమింపవలెనని నిజాముగారికి గట్టియుద్దేశమున్నను ఈ పరిస్థితులలో చందులాల్‌గారు తప్ప ప్రభుత్వ వ్యవహారములను నడపగల సమర్థులు మరి ఎవ్వరును లేరని తోచినందువలన ఆయననేయుండనిచ్చిరి. ఆ సమయమున ఇంగ్లీషు సైనిక దళములకు జీతబత్తెములకొరకును, సంస్థానవ్యయముకొరకును గావలసిన సొమ్మును పోగుచేయుటకు చందులాల్‌గారు పడిన పాట్లును ఆ సందర్భమున ఇంగ్లీషు దళారి వ్యాపారసంస్థయైన పామర్ కంపెనీవారు సంస్థానమునకు ఋణమిచ్చుటలో ఆడిన నాటకమును తరువాత జరిగిన చిత్రవ్యవహారములును చరిత్ర ప్రసిద్ధములైనవి.

హైదరాబాదు సంస్థానమున 1824 నుండి నలుబదేండ్లు పెద్దయుద్యోగము చేసిన సుప్రసిద్ధ గ్రంథకర్త మన మెడోస్ టైలరుగారు 24-9-1843వ తేదీన సీమకు వ్రాసిన లేఖలో చందులాల్‌గారిని గూర్చి ఇట్లు వ్రాసియుండిరి.

‘చందులాల్‌గారు అధికార నిర్వహణమున చాలా సమర్థుడైన రాజ్యనీతిజ్ఞుడు. కార్యదక్షుడు. అయితే ఇటీవల నాలుగు సంవత్సరములనుండి ఆయన శక్తిసామర్థ్యములడుగంటినవి. దుర్మార్గులైన గోసాయీలు, బైరాగులు, ఫకీరులు మొదలైన నేర్పరులైన మోసగాండ్రు చందులాల్‌గారి దగ్గరకు వచ్చి స్వర్గధామమునందు హిందూ మహమ్మదీయ పుణ్యమూర్తులును మహానుభావులును ఉన్న సభామధ్యమునందు చందులాల్‌గారాసీనులైనట్లు తమకు దివ్యదృష్టిలో కనబడుచున్నదనిగాని, ఆయనకు ఐహికాముష్మిక సుఖము కలుగునని తమకు రూఢియైనట్లుగాని చెప్పినచో చందులాల్‌గారుబ్బిపోయి వారికి ధనకనకవస్తువాహనములను బహుమతిగా నిచ్చుచుండును. అట్టివారిలో తెలివితేటలుగలిగిన భాగ్యశాలి యావజ్జీవ పర్యంతము సాలుకు వేయిరూపాయలు వచ్చు జాగీరునుకూడా పొందగలుగును. ఇట్టి యుదాహరణములెన్నో

జరిగినవి. ఈయననుగూర్చి చెప్పుకొను కథలు చాలా వింతగా నుండుటయేగాక హాస్యాస్పదముగా కూడా ఉండును. ఈముదుసలివాడు ఇంక ఎక్కువ కాలము జీవించునని నాకు తోచుటలేదు. ఇంతవరకు విధివిరామము లేకుండా లౌకిక వ్యవహారములందు మునిగితేలుచున్న చందులాల్‌గారికి పనిలేకుండా ఒకచోట కూర్చుండవలసివచ్చుట దుర్భరముగ మండును. ఎల్లప్పుడును లెక్కలేనంతమంది తననాశ్రయించుచుండగా రాజఠీవితో దర్బారు చేయుచుండునతని ఇంటికెవ్వరును రాకుండా ఇల్లు నిశ్శబ్దముగా నుండుటనాయన సహింపజాలడు. ఆయన గుండెపగిలి త్వరలోనే మరణించగలడు' అని టైలరుగారు వ్రాసిరి*. ఇది నిజమేయయ్యెను. చందులాల్‌గారు 1845లోనే దినంగతులైరి. (*Letters of Philip Meadows Taylor to Henry Reeve. OxforD University Press. Page 19-118.)

చందులాల్‌గారిని గూర్చి ఏనుగుల వీరాస్వామయ్యగారు 1830లో తమ కాశీయాత్ర చరిత్రలో వ్రాసియున్నారు. చందులాల్‌గారు తిరుపతిలో గోసాయిలకు సదా వృత్తియిచ్చుట కేర్పాటుచేసిరి. అహోబలక్షేత్రమునకు సాలుకు వేయి రూపాయలిచ్చుచుండిరి. శ్రీశైల దేవాలయము మరమ్మత్తు లేక పాడగుచుండగా చందులాల్‌గారు దానిని మరమ్మత్తు చేయించుటకు పూనుకొనిరి. అయితే ఆ దేవాలయము కందనూరు (కర్నూలు) నవాబుగారి రాజ్యములో చేరియుండి దానిని మరమ్మత్తు చేయువారు మరమ్మత్తుకైనంత సొమ్ము నవాబుగారికి హాసీలుగా చెల్లించవలెనను నిర్బంధముండెను. చందులాల్‌గారు చాలా సొమ్ము వ్యయముచేసి మరమ్మత్తులు పూర్తిచేయజాలక విసిగియూరుకొనిరి. చందులాల్‌గారు దేవ బ్రాహ్మణ భక్తి కలవారు. బ్రాహ్మణులు కాపురముండు షాలిబండ అను పేటలో చందులాల్‌గారు ఇల్లు కట్టించుకొని అందు కాపురముండిరి. ఆయన వేదశాస్త్రములనభ్యసించిన పండితులను గాయకులను పోషించుచు దాన ధర్మముల నిమిత్తము చాలా రొక్కము వెచ్చించుచుండెను.

చందులాల్‌గారికి నరేంద్ర బహద్దరను కుమారుడుండెను. ఆయన కుమారుడైన మహారాజా కిషన్ ప్రసాద్ బహద్దర్‌గారు 1900 మొదలు 1912 వరకును హైదరాబాద్ ప్రధానమంత్రిగా పనిచేసి ఏడవ నిజాము ఉస్మానాలిగారు రాజైన పిమ్మట ఆ పదవి నుండి విరమించిరి. 1925 నుండి 1937 వరకును నిజాముగారి కార్యనిర్వాహక సంఘాధ్యక్షులుగా పనిచేసిరి.

చందులాల్‌గారిని గూర్చి ఆ కాలమున రెండు అభిప్రాయములుండెను. ఆయన కుటిలరాజ్యతంత్రజ్ఞుడనియు, లంచగొండియనియు, దుబారాఖర్చు చేయువాడనియు, దుర్మార్గుడనియు, కొందరాయనను గూర్చి చెప్పుచుండిరి. మరికొందరాయన చాలా మంచివాడనియు, కార్యదక్షుడనియు, స్నేహపాత్రుడనియు, దాతయనియు పొగడుచుండిరి. ఏది ఎట్లున్నను చందులాల్‌గారు సనాతనధర్మపరుడు, దేవబ్రాహ్మణ భక్తి కలవాడు. ఆస్తికుడు, దానధర్మములు చేయుటలో ఆయన దానకర్ణుడనిపించుకొనెను. దేశవ్యవహారములను కూడా ఆయన చాలా జాగ్రత్తగా చక్కబెట్టుచుండెను. ఆయనలోనెన్నిలోపములున్నను సికందరుజా పరిపాలనమునందు హైదరాబాద్ సంస్థాన ప్రభుత్వ వ్యవహారములన్నియు జాగ్రత్తగా నిర్వహింపగల శక్తిసామర్థ్యములు గలవాడింకొకడు దొరకలేదు. ఆ కాలమున సంస్థానమునకు తటస్థించిన చిక్కులను ఆయన గనుకనే తొలగించగలిగినాడని చాలామంది అభిప్రాయము.

హైదరాబాద్ సంస్థాన వ్యవహారములు నానాటికి పాడై వానిని చక్కబరచుటకు చందులాల్‌గారికి కూడా అలవిగాని పరిస్థితులు దాపురించెను. అంతట ఆయన తన పదవికి 1843లో రాజీనామానిచ్చిరి. అప్పటి గవర్నరు జనరలైన ఎలెన్‌బరో ప్రభువు చందులాల్‌గారు హైదరాబాద్ దివాను పేష్కారుగా చేసిన అమూల్య సేవను ప్రస్తుతించిరి. నిజాముగారు చందులాల్‌గారికి నెలకు ముప్పదివేలరూపాయలు చొప్పున ఉపకారవేతనమునిచ్చిరి. అయితే చందులాలుగారు పదునెనిమిది నెలలు మాత్రమే దానిని అనుభవించి దివంగతులైరి.

## ఆంధ్రుల చరిత్రలో వెలుగుచూడని కొన్ని ఘట్టాలు 2: సికిందరుజా నాటి హైదరాబాదు

సికందరుజావారి హయాములో చివరిభాగమున హైదరాబాదు పరిపాలనము చాలా అధ్వాన్న పరిస్థితికి దిగినది. పన్నుల వసూలు ఇజారాదారుల పరముకాగా వారు జిల్లాలలో బలవంతులై ప్రజలను బాధింపసాగిరి. అల్లరులు చెలరేగినవి. వాటిని అణచి శాంతి నెలకొల్పుట కొరకు సైనిక దళములను ప్రయోగించవలసి వచ్చుచుండెను. రాజబాటలలో దొంగలు విచ్చలవిడిగా

తిరుగుచుండిరి. సైనిక బందోబస్తులు లేకుండా ప్రయాణము చేయుటయే దుర్ఘటమైనది. రెవిన్యూ పన్నుల వసూలు కొరకు ఇంగ్లీషు దొరలను ప్రత్యేక కలెక్టరులుగా నియమించవలసి వచ్చెను. అప్పుడు నిజామురాజ్య ప్రభుత్వము దేశములోని వర్తకులగు ఇంగ్లీషువారికినిగూడా ఋణపడినది.

1808–1838 మధ్య మన దేశములో ఇంగ్లీషు సైనికోద్యోగిగానుండిన హెచ్. బివాన్‌గారు తాను చూచిన సంగతులను గూర్చి ఒక గ్రంథమును వ్రాసినాడు. అందులో అప్పటి హైదరాబాదును గూర్చి వర్ణించి, అక్కడి స్థితిగతులను వివరించినాడు. అతడిట్లు వ్రాసెను.

హైదరాబాదు గొప్ప నగరము. దానిలో జనులు క్రిక్కిరిసి నివసించుచున్నారు. ఈ మహానగరమున మహమ్మదీయులు, పఠానులు, హిందువులు జీవించుచున్నారు. గాని తురక మహమ్మదీయుల సంఖ్యయే హెచ్చుగానున్నది. హైదరాబాదు తురకలు హిందూదేశములో నున్నవారందరిలోనూ క్రూరులైన దుండగీండ్రుగను, ఆకతాయిలుగానున్నారు. ఈ బస్తీలో దెబ్బలాటలు, అల్లరులు నిత్యకృత్యములుగా జరుగుచున్నవి. ఆయుధపాణులు వచ్చి ఆపివేసినగాని అవి ఆగవు. ఒకప్పుడీ దేశమును తాము పాలించితిమనియు, ఈ తెల్లవారు తమను త్రోసిరాజనినారనియు యీ తురకలు మరచిపోలేదు. అయితే వారా ద్వేషభావమును పైకి చూపక లోలోపలనే అణచుకొనవలసి వచ్చినందువలన ఆది తగ్గుటకు బదులు మరింత తీవ్రముగా వృద్ధియగుచున్నది. తగిన రక్షణము లేకుండా తెల్లదొరలెవ్వరును ఆ బస్తీలో పోవుటకు సాహసింపరు. ఒకవేళ ఎవ్వరైనను అట్లు పోవుటకు సాహసించినచో వారు అవమానమును పొందకుండగను, బహుశః దెబ్బలుతినకుండగను తప్పించుకొనలేరు. ఇంగ్లీషు బాటసారులను ఈ తురకలు తిట్టినట్టి తిట్లు నోట వచింపరానివి. హైదరాబాదులో ప్రజల నీతినియమములు ఎంతమాత్రము బాగుగలేవు. పుంమైథునము మొదలైన అసహజములును, అమానుషములునగు దుష్ప్రవర్తనములు చాల ఎక్కువగా నుండి సర్వసామాన్యముగా ప్రజల సంభాషణములందు బహిరంగముగా వినవచ్చుచుండెను. ఇంగ్లీషు సైనికదళములు కనుక అక్కడ లేకపోయినచో హైదరాబాదులోని ధనవంతులైన గొప్పవారును, వర్తకులును,

షాహుకారులును ఒక్కరైనను క్షేమముగ బ్రతకలేరు. సగము ఆకలితో వీధులవెంబడి తిరుగు ఆకతాయిమూకలు సైనిక దళములు లేనిచో బస్తీని దోచుకొనెదరనుటకు సందియము లేదు. హైదరాబాదులో వాణిజ్య పరిశ్రమలు చాలా తక్కువ. కీన్కాబు జలతారుబుటేదారు పనిచేసిన పట్టుబట్టలు, తలపాగాలు, చిల్లరనగలు తయారుచేయుటయే అక్కడి ప్రధానవృత్తులు. దేశ ప్రజలుపయోగించు ఉన్ని నూలుబట్టలు చాలవరకు ఐరోపాదేశమునుండియు మచిలీపట్టణము నుండియు నరసాపురము దగ్గరనున్న మాధవాయపాలెము నుండియు, ఇంజరము మొదలైన ప్రదేశముల నుండియు దిగుమతి చేయుచున్నారు. ఉన్న కొలది పరిశ్రమలును హిందువుల చేతులలోనేయున్నవి. హైదరాబాద్ నవాబైన నిజాముగారి కొలువులో స్త్రీల సైనికదళమొకటియున్నది. వీరు ఇంగ్లీషు సైనికులవలెనే ఆయుధములను సైనిక దుస్తులను ధరించి కవాతులు చేయుచుందురు. వీరు జనానాకు కావలిగానుండిరి.

నిజాముగారు రాజ్యపాలనమునెల్ల తమ దివాను పేష్కారు అయిన చందులాల్‌గారికిని ఆయన క్రింది అధికారులకును వప్పగించినారు. మంత్రులు చాలా నిరంకుశులు. ఇంగ్లీషు ప్రభుత్వ ప్రతినిధియైన రెసిడెంటుగారు వీరి పైన కొంత పెత్తనము చెలాయించుచున్నారు. నిజాముగారు చాలా సుఖలోలుడు. అవినీతికరమైన బస్తీయందెల్ల నిజాముగారి కొమాళ్లు మరియు అవినీతి వర్తనులుగానున్నారు. సికిందరాబాదు బోలారములు ఇంగ్లీషువారి సేనలుండు దండుప్రదేశములు. ఇక్కడి దళములలో పండ్రెండువేలమందియున్నారు. వీరిలో పదవవంతు తెల్లవారు. ఇక్కడి వర్తకులును, షాహుకారులును ఇక్కడి దుర్మార్గులవలన బాధపడలేకుండా నుండుటకు ఇంగ్లీషువారిపైననే ఆధారపడియుందురు.

హైదరాబాదులోనున్న షాహుకారులును వడ్డీవ్యాపారస్థులును హిందూదేశములోని ఇతర ప్రదేశములలో నున్నవారివలె గౌరవముకలవారు కారు. వీరు ఆస్తి తాకట్టుపెట్టుకొనిగాని వస్తువులు కుదువపెట్టుకొనిగాని ఋణములిచ్చెదరు. వీరు చాలాహెచ్చువడ్డీలు పుచ్చుకొనెదరు. తాకట్టు ఆస్తి విలువ తగ్గించియు ఇంకను ఇతర విధముగాను మోసముచేయుదురు. ఇంగ్లాండులో తాకట్టుపెట్టుకొని అప్పులిచ్చువారిని వీరు మించిపోయినారు.

హైదరాబాదు చుట్టునున్న ప్రదేశము ముఖ్యముగా బస్తీకి ఆనుకొనియున్న తటాకము దగ్గరనున్న ప్రదేశములు చాలా సుందరముగానుండును. వ్యాహ్యాళికి పోవుటకు చాల చక్కని రాజబాటలును నిజాముగారి యుద్యానవనములు రెసిడెంటుగారి తోటలు ఇంగ్లీషు యుద్యోగుల బంగాళాలు తోటలు ఇండ్లు చాలా అందముగా నుండును. (Thirty years in India (1808-1838) Major Bevan; Story of my life. Meadows Taylor pages 47-60.)

1829 నాటి హైదరాబాదు రాజ్యమును గూర్చి కొన్ని విశేషములు మెడోసు టెయిలరుగారు వ్రాసిరి. మెడోసు టెయిలరుగారిని హైదరాబాదు రాజ్యమున పడమటి జిల్లాలలో అసిస్టెంట్ పోలీసుసూపరెండెఁటుగా నియమించిరి. ఆతనియుద్యోగపుజిల్లా ముఖ్యపట్టణము సదాశివపేట. దానిచుట్టు ప్రక్కల గల దేశములోని ప్రజల మాతృభాష తెలుగే. అయితే కొంతదూరములోనే ప్రజలు కన్నడము మాట్లాడుదురు. అయినప్పటికిని ఆ ప్రాంతమునందలి వ్యవహారములెల్ల మహారాష్ట్ర భాషలోనే జరుగుచుండెను. బీరారు పడమటి సరిహద్దులనుండి ఉప్పు మిరియములు మొదలైన మసాలాదినుసులకు బదులుగా ప్రత్తి నూనెగింజలు అల్లము శొంఠి ధాన్యము ఎగుమతి దిగుమతి వ్యాపారమునకంతకును కూడ హమినాబాద్ పట్టణము కేంద్రముగానుండెను. అక్కడి వర్తకులలో ఆత్మారాము సేఠ్‌గారు చాలా పలుకుబడి కలిగినవాడు. అక్కడ కొందరు వర్తకులు దొంగతూకముతూచి ప్రజలను మోసగించుచున్నట్లును, గోధుమపిండిలో ఇసుక కలిపి అమ్ముతున్నట్లునూ తెలియగా గోధుమపిండి అమ్ము వర్తకులను టెయిలరుగారు మందలించి జరిమానాలు విధించిరి. గోధుమపిండిలో ఇసుకకలిపి అమ్ముతున్న వర్తకులకు బుద్ధిచెప్పదలచి టైలరుగారు తన జవానును పంపి దొరగారు గోధుమ పిండి కొనదలిచిరి కావున తక్కెడతో మీ సరుకును తీసుకునిరమ్మని చెప్పి పంపించి ఒక వర్తకునివద్ద ఒక సేరు గోధుమపిండిని తూపించి దానినావర్తకునే తినమనిరి. ఇసుకకలిపిన ఆ పిండిని అతడు తినలేక బాబు బుద్ధివచ్చినదనినాడు. అంతట అక్కడి వర్తకులందరును సమ్మెకట్టి తమయంగళ్లను మూసివేసి ప్రక్కనున్న మామిడి తోపులలోనికిపోయి భీష్మించుకొని కూర్చుండిరి. ప్రజలకిందువలన ఇబ్బంది కలిగెను. అంతట టెయిలరుగారు దేశములో మహారాష్ట్రులకును ఇంగ్లీషువర్తక కంపెనీ సైన్యములకు జరిగిన యుద్ధములందు ఇంగ్లీషు సైన్యములకు తినుబండారపుసరుకులను

సరఫరాచేసిన బ్రింజారీ(లంబాడీ)ల నాయకులను పిలిపించి ఒక స్వతంత్రమైన బజారును స్థాపించెను. అంతట ఇతర గ్రామములనుండి రకరకముల సరుకులు దిగుమతియగుచుండెను. పారిపోయిన వర్తకులను మరలపిలువనంపుమని కొందరు జిల్లా పెద్దమనుష్యులు టెయిలరుగారికి చెప్పినను అతడు వినలేదు. అంతట అతని పైన కొందరుహైదరాబాదు ముఖ్యమంత్రియైన చందులాల్‌గారిదగ్గర ఫిర్యాదుచేసి అతడు పట్టణములో దౌర్జన్యములు కావించి చాలా సొమ్ము లాగుకొనుచున్నాడని అబద్ధములు కల్పించిచెప్పిరి. ఈ విషయమును గురించి హైదరాబాదులోని రెసిడెంటుగారు టెయిలరుగారిని సంజాయిషీ అడుగగా ఆయన జరిగిన సంగతి చెప్పెను. ఇంతలో ఆతనిపైన ఫిర్యాదుచేసిన వర్తకశిఖామణులు కాళ్లబేరమునకు వచ్చిరి. తమనుగూర్చి టెయిలరుగారు పొరపాటు అభిప్రాయమును పడినారనియు అసలు నేరముచేసినవారిని తాము పట్టి ఇచ్చెదమని, వారినతడు తన ఇష్టమువచ్చినరీతిగా దండింపవచ్చుననియు ఒకవిన్నపమును టెయిలరుగారికిచ్చిరి. హైదరాబాదు రెసిడెంటు మార్టినుగారు ఇది విని సంతోషించి యీ సంగతిని మంత్రిగారికి తెలిపిరి. అప్పుడు చందూలాల్‌గారొక ప్రత్యేకాధికారిని పంపగా అతడు వర్తకులను గట్టిగాతిట్టి వారిపై పదివేలరూపాయలు జరిమానా విధింతునని బెదరించెను. అంతటి పెద్దశిక్ష విధింపవలదని టెయిలరుగారతనిని బతిమాలిరి. అప్పుడతడు వర్తకుల దగ్గర కొంతసొమ్ము లంచము తీసుకొని వెడలిపోయెను. తరువాత టెయిలరుగారు హైదరాబాదుకు వెళ్లి మంత్రి చందూలాల్‌గారిని దర్శించినప్పుడు "మీరా హమీనాబాదు వర్తకులపైన గట్టిచర్యను తీసికొనకుండా చేసితిరి. వారిని మీరు బాగుగా పట్టివేసితిరి. నేను వారిదగ్గర నుండి ఒక లక్ష రూపాయలను గుంజుకొనియుండెడివాడను" అని మంత్రిగారు పలుకగా టెయిలరుగారు "మహారాజా మీరట్లుచేసినచో మీ మంచిపేరు పోయియుండునుకదా. తమ గౌరవము కాపాడినందులకు తమరే నాకొక ఏబది వేలరూపాయలు బహుమానమొసగవలెను" అనిరి.

టెయిలరుగారి క్రిందనుండిన జిల్లాలోని చాలాభాగములు గొప్పజాగీరుదారుల క్రిందను, జమీందారుల క్రిందను చేరియుండెను. వారు హైదరాబాదు ప్రభుత్వమువారు తమ వ్యవహారములందు జోక్యము కలిగించుకొనుట కిష్టపడకుండిరి. వారు చాలా

బలవంతులుగానుండి దోపిడీగాండ్రకు సహాయము చేయుచు దొంగసొమ్ములో భాగము పంచుకొనుట కలవాటుపడియుండిరి. టెయిలరుగారి కందువలన నిక్కడ శాంతిభద్రతలను కాపాడుట చాలా కష్టతరమైన కార్యముగానుండెను. ఇదిగాక, కొంతమంది కొండరాజులును నాయకులును తామే దోపిళ్లు చేయుచుండిరి. అట్టివారి దుశ్చర్యలు మితిమీరిపోయినప్పుడు హైదరాబాదు ప్రభుత్వమువారి యుత్తర్వులను పొంది, వారిని పట్టుకొని, హైదరాబాదు పంపగా, నక్కడ వారిని చందులాల్‌గారు కారాగారమున పెట్టించుచుండిరి. ఇట్టివారిలో గుర్రముకోట రాజా అని పిలువబడు నారాయణరావనునతడు తన దగ్గర బందుగునొకని హత్యచేసి, ఆస్తిని దోచుకొనిపోయెను. అప్పుడతని కోటలోనికి టెయిలరుగారు చాలసాహసముతో ప్రవేశించి ఆతనిని పట్టుకొనిరి. ఆతడు అప్పుడు టెయిలరుగారికి 24,000 రూపాయలు లంచమిచ్చెదనని ఒక బరాతము వ్రాసియిచ్చెను. టెయిలరుగారా సొమ్మును తెప్పించుకొనక అతనిని హైదరాబాదుకు తీసుకొనిపోవుచుండగా అది చాలదని అతడు అభిప్రాయపడుచుండెననుకొని, నారాయణరావు ఏబదివేలిచ్చెదనని బేరముపెట్టెను.

తాము నారాయణరావును చందూలాల్‌గారి దగ్గర హాజరుపెట్టెదమని, ఆ సొమ్మును చందూలాల్‌గారికే సమర్పించవలసినదని టెయిలరుగారనిరి. అట్లు చేయవలదని ఒక లక్ష రూపాయలిచ్చెదననియు నారాయణరావు బతిమాలెను గాని టెయిలరుగారు నిరాకరించిరి.

చందులాల్‌గారు తన దగ్గరనున్న ధనమునెల్ల లాగుకొనునని నారాయణరావు భయము. చందులాల్‌గారు సాధారణముగా బ్రాహ్మణులకురిశిక్ష విధింపరు. వారి ధనము మాత్రము లాగికొందురు.

టెయిలరుగారు చందూలాల్‌గారిని దర్శించగా, నారాయణరావు ఇచ్చెదనన్న లక్ష రూపాయలు ఎందుకు తెప్పించవైతివి, ఇక మనకా ధనము కనపడనివ్వరని చందులాల్‌గారు వగచిరి.

నిజాముగారి జమీందారులు ఉత్తరసర్కారులలో కూడా చాలా దౌర్జన్యములు చేసిరని హైదరాబాదు రాష్ట్రమునందు ప్రతిదినము బందిపోట్లు జరుగుచుండెనని దొంగలగుంపులు గ్రామములను

దోచుకొనుచుండెనని బిల్ గ్రామీగారు తమ గ్రంథమున వ్రాసినారు. (ఆంధ్రుల సాంఘిక చరిత్ర: సురవరం ప్రతాపరెడ్డిగారు పుట 441- 444)

1819 మొదలు 1835 వరకు మద్రాసు సుప్రీంకోర్టులో ఇంటర్‌ప్రెటర్‌గా నుండిన ఏనుగుల వీరాస్వామయ్యగారు 1830-1831 మధ్య కాశీయాత్రకు పోవుచు, హైదరాబాదు రాజ్యమునందు ప్రయాణముగావించి కొన్నాళ్లు హైదరాబాదు నగరములోనుండిరి. వారు చూచిన సంగతులను ఆయన తన మిత్రుడైన కోమలేశ్వరపురము శ్రీనివాసపిళ్ళేగారికి ఎప్పటికప్పుడు వ్రాయుచుండిరి. ఆ వృత్తాంతము కాశీయాత్ర అను పేరుతో 1838లో ప్రకటింపబడెను. అందులో ఆనాటి పరిస్థితులెల్ల కన్నుల గట్టినట్లు వర్ణింపబడియున్నవి.

హైదరాబాదు నవాబు క్రింద ఆనేక జమీనుదారులు నిర్ణీతమైన రూకలు కట్టి సకల రాజ్యతంత్రములను తమ జమిందారీలో స్వతంత్రముగా జరిపించుచున్నారు. సేనాసహాయము సంపద ఎక్కువగాగల జమీందారుడు నిర్ణయమైన సొమ్మును ఇచ్చుటలేదనికూడ చెప్పుచున్నారు. అప్పుడు హైదరాబాదువారు దండెత్తివచ్చి కొట్టి సాధించి సొమ్ము తీసుకొనుచున్నారు. ఆ జమీందారుల కొకరికొకరికి సరిపడనప్పుడు పోట్లాడి చావడమేకాక, ఒకరి గ్రామములనొకరు కొల్ల పెట్టి రైతులను హింసించి, గ్రామాదులను పాడుచేయుచున్నారు. ఈలాగున కలహములు పొసగినప్పుడు న్యాయము విచారించి ఒకరికొకరిని సమాధానము పరచకుండా దివాన్‌జీతనము చేయు చందులాల్ ప్రభృతులు ద్రవ్యకాంక్ష చేత ఉభయులకు కలహములు పెంచి వేడుకచూచుచున్నారు. ఈ లాటి ప్రారబ్దము నాప్రయాణ కాలములో వనపర్తి జమీందారుగారికిని, కొల్లాపురము జమీందారిగారికిని ఒక సంవత్సరముగా పొసగి తహతహపడుచున్నారు. పెంటుపల్లి అను గ్రామములోని కోటలో హైదరాబాదు నవాబు గారిది కొంత ఫౌజు ఉన్నది" అని వీరాస్వామయ్యగారు వ్రాసినారు. (కాశీయాత్ర చరిత్ర 24-25).

జమీందారువారి ఆధీనములోనుండుభూమిపైన పూర్ణమైన స్వాతంత్ర్యము కలిగి ఆయా భూములలోని కాపురస్తులను భర్త భార్యపైన చెల్లించు అధికారముకంటె ఎక్కువైన ఆధికారముతోనే యున్నారనికూడా వ్రాసిరి. (చూ. కాశీయాత్ర చరిత్ర 33-38) ఆయన వ్రాసి 120

సంవత్సరములు దాటినను ఇప్పటికినీ హైదరాబాదు జాగీరులలో రైతులు సర్వరహితులుగనున్నారని సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్ర మొదటి ముద్రణమున వ్రాసియున్నారు

## 1808-1843 నాటి నిజాం రాజ్య చరిత్రలోని చిత్రకథలు 2

రచన: దిగవల్లి వేంకట శివరావు

జనవరి 2021

### ఆంధ్రుల చరిత్రలో వెలుగుచూడని కొన్ని ఘట్టాలు 2: నిజాముగారి బాకీలు

నిజాముగారు ఇంగ్లీషు వర్తక కంపెనీతో చేసికొనిన సంధిషరతుల ప్రకారము కొంత ఇంగ్లీషు సేనను ఆయన రక్షణ నిమిత్తము హైదారాబాదులో నుంచునట్లును దానికగు వ్యయము ఆయన భరించునట్లును ఏర్పాటు చేసికొనిరి. ఆ సైనికుల జీతము క్రింద నిజాముగారు సాలుకు 40 లక్షల రూపాయలు భరించవలసి యుండెను. ఈ సేనలు ఇంగ్లీషువారికి టిప్పు సుల్తానుతోను, మహారాష్ట్రులతోను చేసిన యుద్ధములం దుపయోగించినవి. ఈ సైనిక వ్యయము కొరకు కావలసిన సొమ్మును నిజాము ఎన్ని చిక్కులు పడియైనను సమకూర్చవలసి యుండెను. 1819లో హైదరాబాదులో రెసిడెంటుగా నుండిన రస్సెలుగారు ఇట్టి అసాధారణ వ్యయము కొరకు నిజాముగారు అసాధారణ పద్ధతులలో సొమ్ము సమకూర్చుచుండిరనియు, నిజాముగారి యుద్యోగులు ప్రజల ఆస్తిని జప్తు చేసియు, బలవంతముగా కొల్లగొనియు పీడించి వసూలు చేయుచుండిరనియు వ్రాసినారు (Nawab Mohsnul Mulk; Hyderabad affairs 1884).

సర్ జాన్ మాల్కంగారు స్వయముగా చూచిన కొన్ని విషయములను విన్నవించిరి. నిజాముగారు ఆంగ్లేయోద్యోగుల సహాయముతో చాల కఠినముగా రివిన్యూ వసూలు చేయసాగిరి. ప్రజలలో ఒక్కొక్క వ్యక్తి చెల్లించవలసిన మొత్తమును ముందుగా నిర్ణయించి దానిని వసూలు

చేయుటకు చిత్రహింసల గావించుచుండిరి. కొందరి చెవులకు తుపాకులను తగిలించిరి. కొందరి రొమ్ములపైన పెద్ద బండలనుంచిరి. మరికొందరి వ్రేళ్ళను ఎర్రగా కాల్చిన పట్టుకార్లతో నొక్కసాగిరి (Hyderabad Residency Records, 1884 358 pp.97). రైతులవలన పన్ను వసూలు చేయుటకిట్టి చిత్రహింసలను గావించుచుండిరని కెప్టెన్ సదర్లాండుగారు కూడా వ్రాసియున్నారు (Malcolm Life, vol. 1 p. 17).

హేస్టింగ్స్ ప్రభువు 1813లో గవర్నరు జనరలుగా వచ్చి 1821లో పదవిని విరమించినను 1822 సంవత్సరాంతము వరకును భారతదేశములోనే యుండెను. ఆయన పరిపాలనమునందు చాలా అవినీతికరమైన ఘట్టము హైదరాబాద్ వ్యవహారమని చెప్పవచ్చును. "హైదరాబాద్ జాడ్యములకు పుట్టినిల్లు. అక్కడ అవినీతి తప్ప మరేమియు వర్ధిల్లదు. ఆదేశము నందలి దురదృష్ట ప్రజలను తుపాకి సన్నీల (బాయొనెట్ల) వాడిమొనలను చూపి భయపెట్టియు, పదునైన ఖడ్గములను ఝుళిపించియు సొమ్ము వసూలు చేయుదురు. అక్కడి యన్యాయములకు అంతము లేదు. దానిని గూర్చి విచారించువారు లేరు. వారి మొరలాలకించువారు లేరు. వారి కష్టములను దీర్చువారు లేరు. మహారాష్ట్ర రాజ్యములందు వలనే అక్కడి ప్రభుత్వమునందు క్రమవిధానము లేదు. దానికిని దీనికిని తారతమ్యమేమనగా నిక్కడ పరాయిజనము కొరకు ప్రజలను నిర్దాక్షిణ్యముగా, నిరంతరాయముగా పీడించి బాధించుచుండుటయే. నిజాముగారి క్రింద సివిలు మిలిటరీ యుద్యోగములు చేయుటకు ఆంగ్లేయులు చాల ఉత్సాహముతో వచ్చుచుండిరి. పెద్దపెద్ద యుద్యోగముల నిమిత్తము రెసిడెంటుగారికి నిరంతరముగా అర్జీలు వచ్చుచుండెను. ఇంగ్లీషువారి జేబులలో చాల పెద్దమొత్తములు పడుచుండెను. ఏపనికైనను నిజామే ఖర్చు పెట్టినను దానికి అన్ని ఖర్చులు నిజ్జీయే భరించునని ఇంగ్లీషువారు ఛలోక్తిగా చెప్పుట ప్రారంభించిరి." (Nizzie – Nijam.)

నిజాముగారి కెంత సొమ్ము కూడా చాలుటలేదు. ఆయనకు అందుకు అప్పునిచ్చువారు కావలసి వచ్చిరి. 'విలియం పామరు అండ్ కో' అను పేరిట విపరీతపు వడ్డీ వ్యాపారము చేయు సంస్థ ఒకటి బయలుదేరి నిజాముగారికి అప్పులిచ్చుట ప్రారంభించినది. ప్రతినెలకు ఇరువదివేల

నవరసులను సైనికుల జీతము క్రింద వారప్పు నిచ్చునట్లును, అందు క్రింద నిజాముగారు నూటికి 24వంతుల చొప్పున వడ్డీతో కలిపి లెక్కచూచి తన రాజ్యాదాయము నుండి సాలుకు మూడు లక్షల నవరసులు వారికి వశపరచు చుండునట్లును ఏర్పాటు జరిగెను. పామరు కంపెనీతో నిజాముగారు జరిపిన లావాదేవిలలో నతడు వారిని తన ఆత్మబంధువువలె జూచెను. ఆయన తలకు మీరిన దర్పముతో ప్రవర్తించెను. దీనికి ముఖ్యమైన కారణము ఆ కంపెనీ భాగస్తులలో నొకడు గవర్నరు జనరలైన హేస్టింగ్స్‌గారి పెంపుడు కొమార్తెను పెండ్లియాడిన వాడైయుండుటయే. ఒక స్థిరమైన కార్యాలయము గాని సిబ్బంది గాని లేని ఈ జూటాకోరు కంపెనీవారు జరిగించు వ్యవహారములన్నిటికి గవర్నరు జనరలుగారు మారుమాటాడకుండ తమ అంగీకారము నిచ్చుచుండిరి. దీని విషయమై ఎవరైన ఏదైన అడ్డు చెప్పినచో గవర్నరు జనరలుగారు మండిపడుచుందురు. తూర్పు ఇండియా వర్తక కంపెనీవారికి భారము లేకుండ నిజాముగారి కొరకు పెట్టిన సేనల జీతములు సక్రమముగా చెల్లునను ఆలోచన కూడ ఆయనకుండి యుండవచ్చును.

గవర్నరు జనరలుగారి పెంపుడు కుమార్తెను పెండ్లాడిన సర్ విలియం రంబోల్డుగారు కేవలము ఒక దళారీ మనుష్యుడే. అతడేదో విధముగా వీలైనంత ధనమును సాధ్యమైనంత త్వరలో సంపాదింపవలెనని ఇంగ్లండునుండి హేస్టింగ్సు ప్రభువుతో కూడ భారతదేశమునకు వచ్చినాడు. ఉద్యోగము చేయుటకు గాని, సైన్యములో చేరుటకు గాని అతడు వయసు మీరినవాడైనందున వీలు లేకపోయెను. ధనసంపాదన మార్గముల నన్వేషించుచు నతడు అయోధ్య నవాబు రాజ్యమునకు పోయినాడు. అక్కడ అతనివంటివారు చాలామంది యుండిరి. అక్కడ అధికారిగా నుండిన మెట్‌కాఫ్ ఇతనివంటివారి కవకాశమివ్వడు. మైసూరుకు వెళ్ళినాడు. ఆర్కాటు లేదా కర్నాటక నవాబు దగ్గర పాశ్చాత్యులు చేయుచున్న అవినీతి యొక్క గాలి మైసూరుకు కూడ తగిలినందువలన అక్కడను లాభము లేకపోయెను. అంతట అతను హైదరాబాదు వచ్చినాడు. అయితే అతడి దురదృష్టము వలన మెట్‌కాఫుగారే 1820లో అక్కడికి రెసిడెంటుగా వచ్చినాడు. మెట్‌కాఫుగారు గొప్ప యోధుడు నీతిపరుడు కాని గవర్నరు జనరలుగారికి ఎదురు చెప్పలేక

నిజాముతో జరిగిన సంధిషరతులను సవరించుటలో నొక క్రొత్త నిబంధనను చేర్చవలసిన వాడయ్యెను.

ఇటీవల జరిగిన యుద్ధముల వలన నిజాముగారి రాజ్యమునకు మంచి రక్షణము కలిగినందువలనను, రాజ్యాదాయము నందుకూడ అభివృద్ధి కలిగి ఆయనకు లాభము చేకూరినందునను నిజాముగారు తన కృతజ్ఞతను ప్రకటింపదలచి ఒక ధర్మకార్యమును చేయదలచినాడు. పై సందర్భముల నాలోచించి కలకత్తా నగరమునందు గాని పరిసరములందు గాని ప్రజోపయుక్త కార్యముల క్రింద వినియోగించుట కొరకు 16లక్షల రూపాయలను ఆయన సమర్పించుకొనుట కంగీకరించవలసిందని కోరుచున్నాడు. గవర్నరు జనరలుగారి ఇష్టప్రకారము ఆ సొమ్ము వినియోగపరుపవలెను. కలకత్తా నగరమునం దింగ్లీషువారు కాపురముండు వీధులలో రోడ్లు వేయించుటకును లాంతరు దీపములు పెట్టించుటకును మంచినీరు సరఫరా కొరకును ఈ సొమ్ము గవర్నరు జనరల్ హేస్టింగ్సుగారు వినియోగింపదలచిరి. కాని ఇంగ్లండులోని తూర్పు ఇండియా కంపెనీ డైరక్టరులు దీనికంగీకరింపనైతిరి. హైదరాబాదు సంస్థానము యొక్క స్థితిగతులును రాజ్యాదాయస్థితియును బాగుగా లేదనియు, నిజాముగారు ఇంగ్లీషు కంపెనీ వారివలన అప్పు పుచ్చుకొనుట కంగీకరింపవలసినదని యొక ప్రక్కనుండి రాయుచు ఇంకొక ప్రక్కనుండి నిజాముగారు ధర్మకార్యముల క్రింద నింత పెద్దమొత్తము నివ్వదలచినాడనియు దానికి అంగీకరింపవలసినదనియు వ్రాయుట వలనే డైరక్టరుల కోర్టువారు దీనికంగీకరింపలేదని హేస్టింగ్స్ ప్రభువుగారు బయల్పరచిరి. (Life of Metcalfe, Kaye; vol II p.p. 10.45.)

## పామరు కంపెనీ వ్యవహారాలు

పామరు కంపెనీ 1814లో స్థాపింపబడెను. దీనిని జెనరల్ విలియం పామరుగారి కొమారుడైన జి. డబ్ల్యు. పామరుగారు స్థాపించిరి. పామరుగారు తన చిన్ననాటనే నిజాముగారి సైనికకొలువులో చేరి అక్కడ దేశీయపెట్టుబడిదారులతో కలిసి వడ్డీవ్యాపారము చేయుట ప్రారంభించిరి. ఇంగ్లీషు రాజైన మూడవ జార్జిగారి కాలమున శాసింపబడిన మూడవ చట్టము ప్రకారము తెల్లవారు భారతదేశీయులతో లావాదేవీలు గాని, వ్యాపారసంబంధము గాని కలిగియుండరాదను నొక

నిబంధనముండెను. ఈ నిబంధనను గవర్నరు జనరలుగారి కార్యాలోచన సభలో పామరు కంపెనీవారి వ్యవహారములకు అడ్డు రాకుండ చేయుచు 23-7-1816వ తేదీన తీర్మానించిరి. అట్లు చేయుటవలన ఇంగ్లీషు పార్లమెంటువారిచే ఆ చట్టము ప్రకారము నిషేధింపబడిన వ్యవహారములన్నియు పామరు కంపెనీవారు చేయవచ్చును. అయితే వారిని కోరినప్పుడు ఆ విషయములను గూర్చి ఆ కంపెనీవారు గవర్నరు జనరల్ ప్రభుత్వమువారికి తెలియపరచుచునుండవలెను. వీరు చేయు వ్యవహారము లనేకములుగానుండెను. సొమ్మును వడ్డీకిచ్చుట, పెట్టుబడి పెట్టుట, దేశమున ప్రత్తి, కలప ఇంకను ఇతర సరుకులతో వ్యాపారమును చేయుట, ఇంగ్లండులో తయారైన వస్తువులను భారతదేశములోకి దిగుమతి చేయుట మొదలైన వ్యాపారములు చేయుచుండిరి. మరియు కంపెనీవారు నిజాముగారికి పెట్టుబడి క్రింద క్రమప్రకారము చెల్లించు సొమ్మువల్లనే నిజాముగారు ఉంచుకున్న ఇంగ్లీషు సైన్యము 1817-18 మధ్య జరిగిన మహారాష్ట్ర యుద్ధమునందు యుద్ధభూమిలో పనిచేయుటకు వీలు కలిగెను. ఈ విధములైన లావాదేవీలు నిజాముగారితో 1820వ సంవత్సరము వరకును జరిగెను. వీరి వడ్డీరేటు సహజముగనే హెచ్చుగా యుండెను. అది నూటికి 18 మొదలు 24 వంతుల వరకు నుండెను. అయితే నిజాము ప్రభుత్వమువారు అదివరకే నూటికి 12 వంతుల వడ్డీ చొప్పున అప్పులు తెచ్చుచుండిరి. నిజాము రాజ్యములోను ఇతర సంస్థానములలోను నూటికి 26 మొదలు 40 వంతులును యింకను హెచ్చురేటు చొప్పునను వడ్డీ వ్యాపారము జరుగుచుండెను.

ఆ కాలమున కలకత్తాలోని గవర్నరు జనరల్ కార్యాలోచనసభలో రెండు పక్షములుండెను. ఒక పక్షమువారు హేస్టింగ్స్ ప్రభువు చేసిన పనులన్నిటిని ప్రతిఘటించుచుందురు. రెండవ పక్షమువారు దానిని సమర్థించుచుందురు. అయితే హేస్టింగ్సుగారికి తోడ్పడువారు ఇంగ్లండులో చాలామంది యుండిరి. 1820 నిజాముగారి దివాను పేష్కారుగారు ఈ కంపెనివారి వలన 60లక్షల రూపాయలు అప్పు పుచ్చుకొనగోరగా గవర్నర్ జనరలు గారందులకు తమ అనుమతినిచ్చిరి. అయితే వారి కార్యాలోచన సభలో కొందరి కృషి వలన ఇంగ్లండులోని తూర్పుఇండియా కంపెనీ డైరక్టరులు దీనికంగీకరింపరైరి. ఇది యొక గొప్ప చిత్రకథగా తేలినది.

తమ కాయకష్టము వలనగాక పూర్వకాలము నాటి ఇంగ్లీషు దళారీ దొరల వలెనే వీలైనంత సంపదను పామరు కంపెనీ ద్వారా ఆర్జించుటకు రంబోల్డుగారు కృతనిశ్చయులైరి. అందుకనేక మాయోపాయములను పన్నిరి. అయితే మెట్కాఫ్‌గారి స్వభావమును నీతిధర్మమును పామరు కంపెనీవారు సరిగా గ్రహింపలేకపోయిరి. మెట్కాఫుగారికి నిజాముగారి రాజ్యములో నెక్కడ చూచినను దుఃస్థితియు బాధలు పొందు జనులు వూళ్ళు పొలములు వదలి పోవుచుండుటయు కనబడుచుండెను. ఇంగ్లీషు వడ్డీవ్యాపారులు నిజాముగారి యుద్యోగులకన్నను భారతదేశ రాజాధిరాజులైన ఇంగ్లీషు కంపెనీవారి ప్రభుత్వముకన్నను హెచ్చు అధికారములు చెలాయించుచుండుట మెట్‌కాఫ్‌గారికి గోచరించెను. వీరు తనకు లంచమిచ్చి నోరు కట్టజూచుచున్నారనియు ఆయనకు తోచునట్టి కొన్ని సంగతులు జరిగెను. రెసిడెంటుగారు కాపురముండు రెసిడెన్సీకీ పామరు కంపెనీవారు బుట్టలకు బుట్టలు పండ్లు పంపుటయు, రెసిడెంటుగారి గౌరవార్థము గొప్పగొప్ప విందుల నేర్పాటు చేయుటయు ప్రారంభించిరి. ఇది కేవలము మర్యాద కొరకు ఒక్కసారిగాక పెక్కుసార్లు భారీగా విరివిగా జరుగుటవలన మెట్కాఫ్‌గారి అనుమానము స్థిరమయ్యెను. పైగా ఆయనకు పూర్వము రెసిడెంటుగా పని చేసిన దొరగారికిని ఆయన పరిజనులకు అగుచుండిన యింటిఖర్చు నంతయు పామరు కంపెనీవారును నిజాము యుద్యోగులు కలిసి భరించుచు  వారికి లేనిపోని భోగములను కూడ అమర్చుచుండినందునను మెట్కాఫ్‌గారి పరివార జనులకు నిప్పుడట్టి భోగములు జరుగనందునను మెట్కాఫ్ గారిట్టివి జరగనివ్వనందులకు సేవకులును పరిజనులును అసంతృప్తితో సణగికొనుచుండిరి.

పామరు కంపెనీవారు పంపు బహుమతులను మెట్కాఫుగారు నిరాకరించుట చూడగా నీ వ్యవహారమంతకు ప్రధాన సూత్రధారుడును గవర్నర్ జనరలుగారికి వేలువిడచిన ఇల్లటల్లుడైన రంబోల్డుగారికి ఆశ్చర్యముగానుండెను. మెట్కాఫ్‌గారికి గవర్నర్ జనరలుగారితో అధికారపూర్వకమైన సంబంధముండుటయే గాకఆయన హేస్టింగ్సుగారికి స్నేహితుడై యుండెను. పైగా పామరు కంపెనీ భాగస్థుడైన విలియం పామరుగారు మెట్కాఫ్ గారికి ప్రాణస్నేహితుడు. అతడు పామరు అను గొప్ప సేనానాయకుని కొమారుడు. అయితే స్నేహము వేరు ఉద్యోగధర్మము వేరు అని మెట్కాఫుగారి యభిప్రాయము. అందువల తనకు అన్యాయమని

తోచిన కార్యము జరుగుటకాయన సహింపక తన విద్యుక్తధర్మమును సక్రమముగాను యథావిధిగాను నిర్వహించదలచెను. ఇది చాల కష్టమైన వ్యవహారము. సర్ విలియం పామరు ఢిల్లీలో తన యతిథిగానుండి తన జబ్బులో చాల పరిచర్య చేసినందువలన మెట్కాఫుగారాయన పట్ల చాలా కృతజ్ఞుడై యుండెను. ఇట్టి స్థితిలో పామరు కంపెనీవారు నిజాముగారికి 60లక్షలు అప్పుగా నిచ్చుటకు 1820లో నొక 'ప్రపోజు'ను పంపిరి. ఇది నిజమైన ఋణము కాదనియు, అదివరకుండిన బాకీ అసలు ఫాయిదా మొత్తమునకే పామరు కంపెనీవారి కమీషను క్రింద మరి ఎనిమిది లక్షల రూపాయలను చేర్చి ఋణపత్రమును తిరుగ వ్రాయించుకొన జూచుచున్నారనియు మెట్కాఫుగారు దీని రహస్యమును వెల్లడి చేయుచు పైకి వ్రాసిరి. ఈ ఋణము మొత్తము పైన వడ్డీ నూటికి 25 వంతుల నుండి 18 వంతుల వరకు తగ్గించబడిన సంగతి నిజమే గాని నిజాముగారికి అవసరమైన ఇతర ఋణముల మొత్తములపైన నూటికి 25 వంతులకు పైబడిన రేటు చొప్పుననే పామరు కంపెనీవారు అప్పు నివ్వసాగిరి. సర్ విలియం పామరుగారు తన పలుకుబడి నుపయోగించి గవర్నర్ జనరల్ కార్యాలోచన సభవారు ఏమియు అనకుండా చూచుకొనెదమనియు, మెట్కాఫుగారిని దీని విషయములో అభ్యంతరము చెప్పకుండా ఊరకుండవలసినదనియు వేడుకొనిరి. నిజాము ప్రభుత్వమువారికేదో కొంత సౌకర్యము కలుగుచున్నప్పుడీ వ్యవహారము వలన మాకు మరికొంత లాభించినచో ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వము వారికేమి బాధయనిరి. ఈ ఋణవ్యవహారమునకు రెసిడెంటుగారు సుముఖులుగా నున్నారని పామరు కంపెనీవారు గవర్నర్ జనరలుగారికి చెప్పిరి. అతడు నిజమే యనుకొనెను. కొంచెమించుమించుగా భారతదేశ బ్రిటీషు ప్రభుత్వమువారీ ఋణమును ఆమోదించినట్టుగా గవర్నర్ జనరలుగారు వ్యవహరించిరి.

పామరు కంపెనీవారి లెక్కలలో నీ క్రొత్త వ్యవహారము వలన అమితమైన వడ్డీ లాభములు చూపబడినందున ఇటువంటి లాభసాటి వ్యాపారములో తమ సొమ్మును వడ్డీకిచ్చి లాభము పొందుటకు ఇంగ్లీషు ఉద్యోగులు ఉత్సాహపడిరి. అభూతకల్పనగా పెరిగిన బాకీ క్రింద నిజాముగారు వాయిదాల ప్రకారము పామరు కంపెనీ భాగస్థులు తమ భోగవిలాసముల కొరకు

ఎంత విరివిగా ఖర్చు పెట్టుకొన్నను గూడా యింకనూ మిగిలి కంపెనీ వ్వారికి లాభకరముగానే యుండెను.

మెట్కాఫ్‌గారికీ వ్యవహారమంతయు చూడగా చాలా అన్యాయముగా తోచెను. ఆయనకు కోపము కూడా వచ్చినది. ఎముకలను పిండిచేసి చంపగల కొండచిలువ చుట్టుకొన్నట్లు నిజాముగారిని చుట్టుకొని ఈ పాపపు వ్యవహారము నుండి ఆయన నేదో విధముగా బయటపడవేసి విముక్తుడిని చేయవలెనని తలచి నూటికి 6 వంతుల చొప్పున 6 శాతము వడ్డీనిచ్చు పద్ధతిని 1821లో కలకత్తాలో నొక పెద్దమొత్తమును ఋణముగా తెచ్చుటకు మెట్కాఫ్‌గారు ప్రయత్నించిరి. తన స్వదేశీయులైన ఆంగ్లేయుల మర్యాదను వారి దొరతనము యొక్క గౌరవమును కాపాడవలెనని మెట్కాఫ్‌గారి యూహ. మెట్కాఫ్‌గారు కలకత్తాలో ఋణము చేయుటకు తమ కభ్యంతరము లేదనియు, అయితే నిజాముగారిని ట్లాకస్మికముగ ఋణవిముక్తుని చేయుట వలన తమకు నష్టపరిహారము క్రింద ఆరు లక్షల రూపాయలు చెల్లించవలసి యుండుననియు పామరు కంపెనీవారు చెప్పిరి! హైదరాబాదులోని ఆర్థిక దుఃస్థితిని అన్యాయపు పరిస్థితులను చూచి మెట్కాఫ్‌గారు విషాదముతో నిక్కడి స్థితిగతులను గూర్చి తనకేమాత్రము ఆచూకీ ముందుగా తెలిసినను హైదరాబాదు రెసిడెంట్ ఉద్యోగము తాను అంగీకరించి యుండెడి వాడను కాననిరి. పామరు కంపెనీ వారింత అవమానమకరమైన షరతులను పెట్టినను మెట్కాఫుగారు తన ప్రయత్నమును వదలలేదు. అంతట ఈ మెట్కాఫుగారు తమ కంపెనీకి వ్యతిరేకముగా ప్రవర్తించుచున్నారని చెప్పుచు ఉన్నవి లేనివి గల్పించి గవర్నర్ జనరలు కొక పితూరీ లేఖను రంబోల్డుగారు రహస్యముగ వ్రాసిరి. గవర్నర్ జనరలుగారికి ఆగ్రహము కలిగెను. అయినను మెట్కాఫుగారా వంతయినను జంకలేదు. ఈ సందర్భమున నాయన వ్రాసిన లేఖలు ఆయన యొక్క న్యాయబుద్ధిని సత్యవ్రతమును ధైర్యమును ఆత్మగౌరవమును వెల్లడించుచున్నవి. బహుశః యిట్టి లేఖలు వ్రాయుట వల్లనే ఆయనకు భారతదేశ గవర్నర్ జనరలు పదవి లభించలేదని కొందరనుకొనిరి.

“హైదరాబాదులో వివిధ జిల్లాలను పరిపాలించు అధికారులతో అవినీతిపరులును ప్రజాపీడకులును అగువారితో యీ పామరు కంపెనీ వారికి గల రహస్య సంబంధములను బట్టి రాజ్యములందు జరుగు ఘోరకృత్యములందు వారు భాగస్వాములుగా ఉన్నారని, వారినిగూర్చి ప్రజలనుకొనుటయే గాక, ఇంగ్లీషుజాతి వారందరినీ గూర్చియు అట్టి దురభిప్రాయము ప్రజలలో వ్యాపించుచున్నదని విచారించుచున్నాను. సామాన్యవ్యాపారము చేయు సంస్థకు సాధారణముగా నుండని అధికారముల నీ పామరు కంపెనీవారు చలాయించుచున్నారు. తమకు స్వంతమునకు రావలసిన బాకీలను ఇతరులకు ట్రాన్సుఫరు చేసిన బాకీలను కూడా వీరు నిజాము ప్రభుత్వము వారియొక్కయు బ్రిటీషు ప్రభుత్వము వారియొక్కయు రెండు విధములైన పలుకుబడిని, దానిని పురస్కరించుకొని కొన్ని అధికారములను కూడా ఉపయోగించి బలవంతముగా వసూలు చేయుచున్నారు.

“బ్రిటీషు ప్రభుత్వమువారు ఈ పామరు కంపెనీవారి వడ్డీవ్యాపారము ఇజారాపట్టా నిచ్చినట్లుగా చేసినందువలన నిజాము ప్రభుత్వమువారి పలుకుబడితో స్వంతముగా చౌకరేట్లకు అప్పు తెచ్చుకొని అవకాశము లేకుండ పోయినది. సర్ విలియం రంబోల్డుగారికి గవర్నర్ జనరలుగారైన మీరు సుముఖులుగా నున్నారను వదంతి వలన పామరు కంపెనీవారికి రాజకీయముగా గొప్ప పలుకుబడి యేర్పడినది. ప్రయివేటు లాభము కొరకిట్లు రాజకీయమైన పలుకుబడిని వినియోగించుట అవినీతికి కారణమగును” అని మెట్కాఫ్‌గారు గవర్నర్ జనరలయిన హేస్టింగ్సుగారికి వ్రాసిరి. తనకీ కంపెనీ వారిపై నెట్టి ద్వేషమూ లేదని మెట్కాఫ్‌గారు స్పష్టపరచిరి. మెట్కాఫ్ గారింత గట్టిగా వ్రాసినప్పటికీ లాభము లేకపోయెను. గవర్నరు జనరలుగారు కంపెనీ పక్షమునే వహించిరి.

హైదరాబాదులో పామరు కంపెనీవారి పక్షీయులైన దొరలును దేశీయులును మెట్కాఫ్‌గారిని హేళన చేయసాగిరి. ఇట్లు కొంతకాలము గడిచెను. తుదకు ఈ వ్యవహారములోని అన్యాయములు అందరికీ తెలిసినందున గవర్నర్ జనరలుగారిని ఇంగ్లండులోని కంపెనీ డైరక్టరులు విమర్శింపగా ఆయన 1821లో పదవికి రాజీనామా నిచ్చిరి. 1822 సంవత్సరాంతవు వరకు నాయన

భారతదేశముననే యుండెను. పూర్వము గవర్నరు జనరలుగా నుండిన వారన్ హేస్టింగ్సుగారి అవినీతిని గూర్చి జరిగిన విచారణ సందర్భములందు వలెనే యీ పామరు కంపెనీవారు అక్రమ వ్యాపార సందర్భమునందు హేస్టింగ్సుగారు జరిపిన చర్యలను గురించి వాదోపవాదములు చెలరేగెను. గవర్నరు జనరలు కార్యాలోచన సంఘములో సభ్యుడైన జాన్ ఆడంగారు క్రొత్త గవర్నరు జనరలుగా కొంతకాలము ఆక్టింగు చేసిరి. తరువాత అనహారెస్టుగారు గవర్నరు జనరలుగా వచ్చిరి. ఆడంగారికీ పామరు కంపెనీవారి అన్యాయమంతయూ అవగతమయ్యేను. పూర్వము రెసిడెంటుగారి క్రింది ఉద్యోగులందరు నీ కంపెనీవారితో కలిసి కుట్ర చేసినారని తెలిసినది. అంతట పామరు కంపెనీవారి బాకీలలో ప్రత్యక్షముగా అన్యాయముగా కనపడిన పద్దులన్నిటినీ ఆడంగారు నిరాకరించిరి. కంపెనీవారికి 80లక్షల రూపాయలు చెల్లించబడెను. ఇదియైనను సంస్థానము న్యాయముగా భరించవలసిన ఋణమని చెప్పుటకు వీలులేదు. పామరు కంపెనీవారెంత అన్యాయార్జనము చేసి అమిత లాభము లార్జించినను తరువాత ఒక్క సంవత్సరములోనే దివాలా తీసిరి. ఇతరులకు వీరివ్వవలసిన మొత్తము లివ్వవలసినదని వీరిని వత్తిడి చేయుట వలన వీరు దివాలా తీయలేదు. ఆ కంపెనీవారి సాధారణ వ్యయములకే సొమ్ము చాలక అది దివాలా తీసెనని మెట్కాఫ్‌గారు 1828 సంవత్సరము డిసెంబరు నెల 11వ తేదీనా వ్రాసిన మినిట్సు వలన తెలియుచున్నది. దీని అర్థమేమనగా కంపెనీ భాగస్తులా కంపెనీ సొమ్మును దుబారాగా వాడుకొనుట వలన దినవెచ్చములకే సొమ్ము లేక కంపెనీ నాశనమైన దనియె. కంపెనీ దివాలా తీసినను సర్ విలియం రంబోల్డుగారు యీ దేశముననే చాలా కాలము నివసించి ఈ వ్యవహారమునందు జరిగిన సంగతులకు తన అసంతృప్తిని ప్రకటించుచు నింక నితర వ్యవహారములందు తన చాకచక్యమును చూపుచు కాలక్షేపము చేయసాగిరి.

(సశేషం)

## 1808-1843 నాటి నిజాం రాజ్య చరిత్రలోని చిత్రకథలు 3

రచన: దిగవల్లి వేంకట శివరావు

ఫిబ్రవరి 2021

## ఆంధ్రుల చరిత్రలో వెలుగు చూడని కొన్ని ఘట్టాలు 3: ముబారిజ్ ఉద్దౌలా

నిజాం సికిందరుజా 1829 జూన్ నెలాఖరున చనిపోవగా ఆయన పెద్ద కుమారుడైన వజీరు ఉద్దౌలా నిజామై 1857 వరకును పరిపాలించెను. ఇంగ్లీషు రెసిడెంటుగారాయనను అభినందించుటకు దర్బారుకు వెళ్లగా కొత్త నిజాముగారు తన రాజ్యములోని ఫరంగీయుద్యోగులు చాలా హెచ్చుగా ప్రభుత్వాధికారములు చెలాయించుచున్నారనియు, వారిని తీసివేయవలెననియు రెసిడెంటును కోరెను. అయితే తన తండ్రిగారి కోరికపైననే యీ ఆంగ్లేయోద్యోగులు నియమంపబడియున్నందున అతడు కోరినట్లు వారిని వెంటనే తీసివేయక ఉపేక్షవహించిరి.

నిజాముగారు ఆరడుగుల పైగా ఎత్తుగల ఆజానుబాహుడు. మంచి స్ఫురద్రూపి. నీలవర్ణపు తార్తారీనయనములవారు. ఈయన సోదరుడైన ముబారిజుద్దౌలా కొందరు అరబ్బులను ఆఫ్గనులను చేరదీసి 1830లో హైదరాబాదులో స్వేచ్ఛావిహారము చేయుచు తవ అన్నగారినేవో కొన్ని కోరికలు కోరసాగెను. అతడు బలవంతుడుగానున్నందున అల్లరులు జరుగుటకు సిద్ధముగా నుండగా ఇంగ్లీషు సేనాధిపతియైన కర్నల్ స్టీవార్టును బొలారం నుండి ఒక సైనికదళమును పంపి అల్లరులనణచవలసినదని నిజాముగారు కోరిరి. అంతటనొక బ్రిగేడియరును సైనికదళమును రెండు ఫిరంగులను ఇచ్చి పంపి ముబారిజుద్దౌలాగారిని హైదరాబాదు వదలి, గోలకొండకు పోయి అక్కడనుండవలసినదనియు తన అన్నగారితో తనకుగల తగవులను పరిష్కరించుకొను విషయమున దౌర్జన్యమునకు దిగక అన్నగారిపైన భారమువేసి ఓపికపట్టి యుండవలసినదనియు చెప్పి ఒప్పించిరి. అతడక్కడకు పోయిన పిమ్మటనొక క్రొత్త చిక్కు కలిగెను. గోలకొండ కోటలో అప్పుడు పదిలక్షల నవర్సులు ఖజానాలో నుండెను. దానిని తీసుకొని వచ్చుటకై నిజాముగారొక అధికారిని, కొంత సైనిక సిబ్బందినిచ్చి పంపిరి. అయితే ముబారిజుఖాను వారిని ఖజానాను తీసికొని పోనివ్వక ఆటంకపరచిరి. అధికారికి తగిననంత సైనిక బలము లేనందువలన నతడు చేయునది లేక కోటగుమ్మం దగ్గర సైనికులను కాపలాయుంచెను. అంతట, హైదరాబాదు నగరమునందు గొప్ప అలజడి కలిగెను. అప్పుడు అయిదువేల మంది అరబ్బులు రోహిలాలు శిక్కులు మొదలైన జాతీయ

సైనికులను, పూర్వకాలపు ఫ్రెంచిలైను సైనికులను నిజాముగారు గోలుకొండకు పంపగా వారక్కడ విడిసియుండిరి. అయినప్పటికి ముబారిజుద్దౌలా భయపడలేదు. ఆ సైనికులలో కొంతమంది ఈరాజకుమారునిపట్ల సానుభూతి కలిగియున్నవారని అందరికిని తెలిసిన విషయమే. అంతట కొన్నాళ్ళపాటు నిజాముగారి మంత్రులకు రాజకుమారునికి రాయబారములు జరిగెను. కాని ప్రయోజనము లేకపోయెను. అందువలన నిజాముగారి మంత్రి బొలారములోని ఇంగ్లీషు సైన్యము యొక్క ప్రధానాధికారిని సహాయము చేయవలసినదని కోరెను.

అప్పుడు 1831 జనవరి నెల 6వ తేదీన ఇంగ్లీషు కంపెనీ సైనికదళము ఢిల్లీ దర్వాజాకు ఉత్తరమున కుతుబ్‌షాహి సుల్తానుల గోరీల దగ్గర దండు విడిసిరి. గోలుకొండ కోటలోపల రాజకుమారుడు తన సైన్యముతోనుండెను. కోట వెలుపల ప్రాకారములో నిజాముగారి సైన్యములుండెను, వీరుకూడ ఇంగ్లీషువారి సైనిక దళమును శత్రుసైన్యముగనే పరిగణించి వారిని లోపలికి రానివ్వలేదు. కోటగోడలమీది ఫిరంగులను బారుచేసియుంచి ముందుకువచ్చినచో గ్రుండ్లు ప్రేల్చెదమని బెదిరించినట్లుగా వానిని పెట్టియుంచిరి. ఇంగ్లీషు సైనిక కెప్టెను మెడోసు టెయిలరు ఒక దినమున నాయావరణము వెలుపల కందకము ప్రక్కకు తన గుర్రముపైన పోవగానచ్చటి సైనికులాయనను వెనకకు పొమ్మని నిర్మొగమాటముగా హెచ్చరిక చేసిరి. టెయిలరు ఆ కందకమును చూడగానది చాలా వెడల్పు కలిగియుండెను. అతడు అక్కడి నిజాముగారి సైనికులతోనేదో లోకాభిరామాయణము మాట్లాడినట్లుగా నాలుగు మాటలు మాట్లాడి మంచిచేసుకొని మర్యాదగా వెనుకకు వచ్చివేసెను.

ఇంగ్లీషు సైనికదళమువారు ఫిబ్రవరి 15వ తేదీవరకును ఏమియు కదలిక లేకనేయుండిరి. ఆదినముననాకస్మికముగా ఇంగ్లీషుసైన్యమును కోటలోనికి పోవలసినదనియును కోటలోపలనున్న నిజాముగారి సైన్యమును వెలుపలికి రావలసినదనియును ఉత్తర్వులు చేసిరి. ఇంగ్లీషు సైన్యము కోటలోపల ఆవరణము లోనికిపోయి రాజకుమారుడున్న రాజప్రాసాదమునకును ఖజానాయున్న కొట్లకును మధ్యగా తమ శిబిరమును స్థాపించి వెంటనే కాపలా నిమిత్తము అన్నిప్రక్కలను సైనికులను నిలిపిరి. ముందువరుసలో కెప్టెను మెడోస్

టెయిలరుగారి నాయకత్వము క్రింద నాలుగు కంపెనీల సైనికులును, రెండు ఫిరంగిబండ్లునుండెను. అతడు ఫిరంగులలో మందుగుండు సామగ్రి కూరించి సిద్ధముగానుంచెను. రాజకుమారుని పరివారము ఈ సన్నాహమును చూచుచుండిరి. నిజాముగారి మనుష్యులు ఖజానా కొట్లలోనికి పోయి అందులోని రూపాయీల సంచులను అవతలికి మోసుకొనిపోవసాగిరి. ఇది నాలుగురాత్రిళ్ళు, నాలుగుపగళ్ళును పట్టెను. ఈ నాలుగురోజులును కెప్టెన్ టెయిలరుగారు కదలుటకు మెదలుటకు వీలులేక బట్టలుకూడా మార్చుకొనలేదు. ఆ సమయమున రాజకుమారుడు చేర్చిన అరబ్బీసైనికులు మ్రోగించు ఒకవిధమైన తప్పెటలధ్వని నిరంతరము చెవులలో ధ్వనించుచుండగా ఇదిగో వారువచ్చి పైబడిపోవుచున్నారను వదంతులవలన గుండెలదురుచుండగా టెయిలరుగారును తన సైనికులును అప్రమత్తులై యుండవలసివచ్చెను. అయిదవదినము ఉదయమున రాజకుమారుని దగ్గరనుండి ఒక రాయబారమువచ్చెను. ఆయన తన పరివారజనమును మాత్రము తనదగ్గరనుంచుకొని తాను చేర్చిన ఆయుధపాణులైన అరబ్బులను పంపించివేసెదనని కబురంపెను. టెయిలరుగారి సైనికులనింక వెనుకకు పంపవచ్చునని యొకయుద్యోగి వచ్చి చెప్పెను. ఆ వార్తవిని టెయిలరుగారు సంతోషించిరి. ఆయనక్రింది సైనికులు ఆయన గౌరవార్థముగా 'బోలో మహదేవబాబాకీ జేయ్' అని ఆకాశము చిల్లులుపడునట్లు అరచిరి. అతడు తన క్రిందిసైనికుల యనురాగమునకు పాత్రుడైయుండినందులకిది గొప్పనిదర్శనముగానుండెను. అతనికి మొదటనిది అర్థముకాలేదు. అయితే ఆయన దళములోని ఫిరంగులను జాగ్రత్తగా కనిపెట్టియుండుటకు నియోగింపబడిన టెయిలరుగారి స్నేహితుడీ జయఘోష ఆయన గౌరవార్థం చేయబడినదేనని అతనికి చెప్పి ఇకముందీబిరుదు అతనికి శాశ్వతముగా నిలుచునని, అతడదృష్టవంతుడు అనిచెప్పి, దాని నిదర్శనముగానతడు సైనికులవంకకుదిరిగి 'బోలో మహదేవబాబాకుజేయ్' అని హెచ్చరించగా వారు మరలనట్లు జయజయధ్వానములు చేసిరి.

## ముబారిజ్ ఉద్దౌలా, వాహబీల కుట్ర

ఇక్కడ పనియైపోయినందున సైన్యమెల్ల మరల బొలారమునకు పోవదలచెను. కాని నిజాముగారు ఆరుకంపెనీలవారిని కోటలోనే యుంచవలసినదని కోరగా, ఆంగ్లసేనాధిపతియట్లా సైనికదళములో కొంతభాగమునక్కడ నిలిపి దానికి టెయిలరుగారినే అధిపతిగా నియమించెను. రాజకుమారుడు మరల ఆయుధపాణులను కోటలోపల చేర్చకుండా చూచుటకును, రెసిడెంటుగారికిని రాజకుమారునికిని జరుగు ఉత్తర ప్రత్యుత్తరములు పరిశీలించుటకును పారశీ భాష తెలిసిన టెయిలరుగారు నియమింపబడిరి. ఇదివరకే రాజకుమారుడు నిజాముగారికిని, ఆయన మంత్రిగారికిని, రెసిడెంటుగారికిని వ్రాయుజాబులలో చాలా అగౌరవముగా వ్రాయుచుండిరి. అందువలన ఆయన వ్రాయు జాబులనెల్ల విప్పి చూడవలసినదనియు అవి పూర్వపు ధోరణిలోనే యున్నచో వానిని పంపవలదనియు వీలైనచో నీయన్నదమ్ముల మధ్యగల వివాదములను సర్దుబాటు చేయుటకు ప్రయత్నించవలసినదనియు రెసిడెంటుగారు టెయిలరుగారికి చెప్పిరి. అంతట టెయిలర్‌గారు అక్కడ కొన్నాళ్లు ఆపనిని చూడసాగిరి. కొన్ని దినములవరకును ఆ రాజకుమారుడు వీరిని గమనింపక ఉపేక్షించెను. టెయిలరుగారు చిన్న పడవనొకదానిని తెప్పించి కోటగోడలను అంటియున్న తటాకములో పడవ షికారుచేయుట ప్రారంభించిరి. రాజకుమారుడొక టెలిస్కోపుతో వీరిని చూచుట మొదలిడెను. ఈ సంగతి టెయిలరుగారు గ్రహించిరి. తుదకు రాజకుమారుని మున్షీగారొకదినమున టెయిలరుగారికి కనుచూపుమేరలో వచ్చి నిలిచిరి. అంతట పడవలోనికి రండని టెయిలరుగారాయనను ఆహ్వానించిరి. అంతట ప్రతిదినము ఉదయమును, మధ్యాహ్నమును మంచి వంటకములు బహుమతిగా వచ్చుట ప్రారంభమయ్యెను. కొంత స్నేహభావము కుదిరెనని టెయిలరుగారు రెసిడెంటుగారికి తెలిపిరి.

అటుపిమ్మట రాజకుమారుని లేఖలు రెసిడెంటుగారి పేరిట వొకటి, నిజాముగారి పేరిట నింకొకటి వచ్చెను. అందులోని భాష చాలా తీవ్రముగా నుండెను. వానిని టెయిలరుగారు త్రిప్పివేసిరి. పదునైదు దినములవరకు నిట్టిలేఖలే వచ్చుటయు, టెయిలరుగారు వానిని త్రిప్పివేయుటయు జరిగెను. చేపను వలలో వేసితివని రెసిడెంటుగారు టెయిలరుగారితో ఛలోక్తిగా పలికి 'అతడింకను బెట్టు వదలలేదు. నేనిప్పుడే జోక్యము కలిగించుకొనను' అనిరి. తరువాత కొన్ని దినములకు

రాజకుమారుడు మౌనము వహించెను. కాని ఇది ఎంతకాలమో నిలువలేదు. ఒక దినము సాయంకాలము మున్షీగారు కొన్ని మంచి పిండివంటలను టెయిలరుగారి కొరకును, మంచి భోజనమును ఆయన సైనికులకందరకును తెచ్చియిచ్చి 'రాజకుమారుని ఆత్మగౌరవము మీ హస్తములయందున్నది. అందరికి అంగీకారముగా నుండులాగున మీరొక లేఖను తయారుచేయుడు' అని మున్షీగారు రాజకుమారుని మాటగా చెప్పిరి. టెయిలరుగారొక జాబుయొక్క చిత్తుప్రతిని తయారుచేసిరి. దానిని రాజకుమారుడు చూచి ఆగ్రహించి నా పరువును మీరింత అలుసుగానెంచితిరని టెయిలరుగారిని దూషించిరి. ఆ లేఖయొక్క మతలబులోని భాష విషయమై వారము దినములు పెనగులాట జరిగెను. ఎట్టకేలకు టెయిలరుగారికిష్టము వచ్చినట్లు వ్రాసి తీసికొనిరమ్మని రాజకుమారుడు మున్షీగారికి చెప్పిపంపిరి. టెయిలరుగారు ముందుగా నింగ్లీషులో నొక చిత్తును తయారుచేసి దానిని వ్రాసి రాజకుమారునికి పంపిరి. అంతట నా మరుసటిదినము మధ్యాహ్నము ఆ లేఖను రాజకుమారుని సంతకముతో మున్షీగారు తెచ్చిరి. వీరుభయులును పడవలో షికారు చేయుచుండగా రాజకుమారుడొక తెల్లని జండాను ఆడించుచు సంజ్ఞ చేయసాగెను. టెయిలరుగారు తన చిన్నయోడ 'జోరా'లో నుండి చిన్నమూతి ఫిరంగులనుండి పండ్రెండు గుండ్లను ఆకాశములోనికి పేల్చి రాజకుమారునికి జోహారులొనర్చిరి. ఆ మరునాడాలేఖలను టెయిలరుగారు రెసిడెంటుగారి దగ్గరకు తీసికొనివెళ్లిరి. అందులో నిజాముగారి పేర వ్రాయబడిన లేఖను వెంటనే నిజాముగారికి పంపివేసిరి. ఈ లేఖ బాగుగనె యున్నదని నిజాముగారు సెలవిచ్చిరి. తమ తల్లిగారిని గోలకొండకు పంపి తన తమ్మునికి కొన్ని వాగ్దానములను గావించి అతనిని హైదరాబాదుకు రప్పించుటకు తగిన ఏర్పాటు చేయవలసినదని నిజాముగారుత్తరువు చేసిరి. టెయిలరుగారు గోలకొండకు తిరిగి వెళ్ళునప్పటికే నిజాముగారి తల్లిగారైన బీగం సహిబాగారు అక్కడకు వచ్చియుండిరి. తాను తన కుమారుడును ఒకరినొకరు కౌగలించుకొని యేడ్చితిమని  ఇరువురు స్త్రీ పరిచారికల ద్వారా ఆమె టెయిలరుగారికి కబురంపిరి. ఒకటి రెండుదినములలో తగిన గౌరవముతో ముబారిజుద్దౌలాగారిని హైదరాబాదునకూరేగింపుతో తీసుకొని వెళ్లిరి. తమ కుటుంబమునకింత  గొప్ప సేవనుచేసినందులకు నిజాముగారు టెయిలరుగారికి వందనములు చేసిరి. అన్నదమ్ములు సఖ్యతపడిరి.

అటుతరువాత కొంతకాలమునకు టెయిలరుగారికి పెండ్లి నిశ్చయమైనట్లు ముబారిజుద్దౌలాగారు విని తమ కార్యదర్శిని టెయిలరుగారి యొద్దకు పంపి పారశీ భాషలో నొక అభినందన పత్రమును వెండి పళ్ళేరములోనుంచి దానిపైన బంగారు జరీబుటేదారి పనిచేసిన పట్టువస్త్రమును కప్పి ఆ పత్రికకు జతపరచిన జాబితాలో చెప్పబడిన బహుమతులను తమకు టెయిలరుగారు చేసిన సేవకు బహుమానముగా పంపుచున్నామనియు, వానిని స్వీకరించవలసినదనియు కోరిరి. అందులో విలువగల శాలువలు, అమూల్యములైన హారములు, శిరోభూషణములు, వజ్రములు మొదలైన రత్నములు తాపిన తోడాలు, రత్నములు తాపిన బంగారు ఒడ్డాణము, ఏడువరుసల మంచిముత్యాల హారము, నింకొక వజ్రము తాపిన పతకము ఇరువదివేల రూపాయలు విలువగల బహుమతులుండెను. అయితే టెయిలరుగారు సైనికోద్యోగి యైనందున ఆ యుద్యోగ నిబంధనల ప్రకారము అట్టి బహుమానములను స్వీకరింపవీలులేనందున రాజకుమారుడు చూపిన యనుగ్రహమునకు టెయిలరుగారు కృతజ్ఞతాసూచకమైన వందనములర్పించి బహుమతులు వలదనిరి. (Story of My Life. Meadows Taylor. PP. 71-76.)

## వాహబి కుట్ర

వాహబీలనువారు తీవ్రమతావేశపరులగు మహమ్మదీయులు. వీరు హిందువులనేగాక పందిమాంసము తిను ఆంగ్లేయులను కూడా కాఫరులని ద్వేషించుచుండిరి.

ఇంగ్లీషువారు హిందూదేశములోని మహమ్మదీయ సామ్రాజ్యమును నాశనముచేసి రాజ్యాక్రమణ చేయుటయేగాక ప్రక్కనున్న మహమ్మదీయ రాజ్యమగు ఆఫ్ఘనిస్థానము యొక్క రాజకీయములందు జోక్యము కలిగించుకొని దోస్తు మహమ్మదుకు బదులుగా షాషుజాను సింహాసనమెక్కించుటకు కుట్ర చేసిరి. 1838 అక్టోబరు 1వ తేదీన సిమ్లాలో నీవిషయమై ఒక ప్రకటన చేసిరి. ఆఫ్ఘనిస్థానములో తీవ్రముగా యుద్ధము జరుగుచుండెను. ఇంగ్లీషువారు పంపిన దేశీయసైన్యములు చాలా బాధలనుభవించి నాశనమయ్యెను.

ఈ సమయమున నీయింగ్లీషువారిని మనదేశమునుండి వెళ్లగొట్టవలెనని వాహబీలు గొప్ప కుట్ర సాగించిరి. వాహబీ ఫకీరులను దక్షిణ హిందూదేశమున హైదరాబాదునకును, మద్రాసుకు దక్షిణమునగల దూరప్రాంతములకును కూడా పంపి ఇంగ్లీషువారిపైన మతయుద్ధము (జిహాద్) చేయుడని మహమ్మదీయులను ప్రోత్సహించిరి. ఆ యుద్ధము కొరకు సర్వసన్నాహములును జరిగెను. కర్నూలు నవాబైన గులాం రసూలుఖాను వాహబీల కుట్రకులోనై తన కోటలో జనానామందిరముల క్రింద నేలకొట్లను నిర్మించి అందులో గొప్ప ఆయుధాగారమును స్థాపించి మారణాయుధములను, ఫిరంగిబండ్లు, గొట్టములు, ఇనుపగుండ్లు తయారు చేయించెను. హైదరాబాదు నిజాంగారి సోదరుడైన ముబారిజ్ ఉద్దౌలాగారును, ఆయన అనుచరులును యీ కుట్రలో చేరిరి. హైదరాబాదులోని ఇంగ్లీషు సైన్యమునకు చెందిన దేశీయ సిపాయిలను తిరుగుబాటులో చేర్చుటకై వారు కృషిచేసి సిపాయిలలో కొందరి మనస్సులు విరచిరి. అప్పుడు చిత్రచిత్రములైన రహస్యపద్ధతులతో రాజద్రోహ ప్రచారము జరుగుచుండెను. హైదరాబాదులో వాహబీల కుట్ర సంగతి 1839లో ఆకస్మికముగా బయల్పడెను. ఒక పేదరాలికి ప్రాణముమీదికి రాగా ఆమెయొక రక్షరేకును మూసీనదిలో పడవేయమని ఒకరికిచ్చెను. అందులో నీకుట్రకు సంబంధించిన ఉత్తరము బయల్పడెను. అంతట ఇంగ్లీషువారు విచారించగా నీ కుట్రయొక్క ఆనుపానులు తెలిసెను. ముబారిజ్ ఉద్దౌలాగారిని, ఆయన అనుచరులను నలుబదిమందిని పట్టుకొనిరి. ఆయనను గోలకొండ కోటలో ఖైదు చేసిరి. ఆయన అనుచరులను కొందరినురిదీసిరి. ముబారిజ్ ఉద్దౌలాగారు 1854లో చరమ నిర్బంధములోనుండి మరణించిరి.

కర్నూలు నవాబగు గులాం రసూలుఖానుగారి కోటను తనిఖీచేయగా రహస్యాయుధాగారము బయల్పడెను. అంతట ఆయనను పట్టుకొని పదచ్యుతుని చేసి తిరుచినాపల్లిలో ఖైదుచేసిరి. ఆతడక్కడ ఇంగ్లీషువారి మెప్పుకై క్రైస్తవ దేవాలయములో ప్రార్థనలకు హాజరగుట ప్రారంభించెను. అప్పుడొక వాహబీ ఫకీరతనిని వధించెను. (చూడుడు. కందనూరు నవాబు రాజరికము. కథలు గాథలు. 1వ భాగము. శ్రీ దిగవల్లి వేంకట శివరావు; South Indian Sketches. S. Tucker, 1842.)

## షోరాపూరు సంస్థానము

హైదరాబాదు నవాబుగారికి కప్పము చెల్లించు సామంతరాజ్యములలో నేటి రాయచూరు జిల్లాలోని షోరాపూర్ సంస్థానమొకటి. దానిని బోయజాతి బేడరు నాయకులు పాలించుచుండిరి. వీరు తెలుగువారు. ఈ సంస్థానమునేలు క్రిష్టప్ప నాయకుని తండ్రి చనిపోవునప్పుడు తన రెండవభార్య కుమారుడైన యీ క్రిష్టప్ప నాయకుడే తన తరువాత రాజ్యమేలవలెనని శాసించెను. పెద్దభార్య కుమారుడైన హనప్ప నాయకుడిది అన్యాయమని, రాజ్యము తనకే రావలెనని దివాను పేష్కారు చందులాల్‌గారితో మొరపెట్టుకొనెను. తన తండ్రి పట్టాభిషేకము జరిగినప్పుడు రెండవభార్యనే తన కుడిప్రక్క కూర్చుండబెట్టుకొనెనని, అందువల్ల ఆమెనే పట్టమహిషిగా పరిగణించినాడని, తననే యువరాజుగా పరిగణించినాడని తనకే రాజ్యము రావలెనని క్రిష్ణప్ప నాయకుడనెను. ఈ తగవు పరిష్కారము చేయుటలో క్రిష్ణప్ప నాయకుడు హైదరాబాదు నిజాముగారికి పదునైదు లక్షల రూపాయలు చెల్లించు పద్ధతిని చందూలాల్‌గారతనినే రాజుగా నంగీకరించిరి. ఈ సొమ్ము వాయిదాల ప్రకారము చెల్లించవలసియుండెను. ఆ బాకీ తీరకుండగనే క్రిష్ణప్ప నాయకుడు మరణించెను. అతని మైనరు కుమారుడైన వేంకటప్ప నాయకుడేడేండ్ల పిల్లవాడు. అతని తల్లి ఈశ్వరమ్మ తన కుమారుని పక్షమున రాజ్యాధికారము వహించెను. కొందరు బేడరు నాయకుల కామెపైనిష్టము లేదు. అందువల్ల వారు క్రిష్ణప్ప నాయకుని సోదరుడైన పెద్దినాయకుడు సంరక్షకుడుగా నుండి రాజ్యము పాలింపవలెనని పట్టుపట్టిరి. నిజాము సర్కారువారును ఇంగ్లీషు గవర్నరు జనరలుగారును దీనికంగీకరించిరి. అయితే కొందరు బేడరు నాయకులు పెద్దినాయకునికి వ్యతిరేకులై ఈశ్వరమ్మ పక్షమవలంబించిరి. సంస్థానమున యీతగవులతో అల్లకల్లోలముగా నుండెను. ఈ తగవులను పరిష్కరించి సంస్థానమును పరిపాలించుటకు మెడోస్ టెయిలర్ అను ఇంగ్లీషు దొరను 1841లో చందూలాల్‌గారి కోరికపైన రెసిడెంటుగారు షోరాపూరునకు మేనేజరుగా పంపించిరి. అతడు వెంకటప్ప నాయకుని మైనారిటి తీరువరకును సంస్థాన వ్యవహారములను చక్కబెట్టి రాజ్యమునతనికి వప్పగించెను.

టెయిలరు తన జీవిత చరిత్రలో ఈ సంస్థానమును గురించి, ఈశ్వరమ్మగారినిగూర్చి, వేంకటప్ప నాయకుని గూర్చి చాలా విశేషములు వ్రాసియున్నాడు.

## హైదరాబాద్ సంస్థానములో అల్లకల్లోల పరిస్థితులు

క్రీ. శ. 1769-1793 సంవత్సరములలో తెలంగాణమునందు ఘోరమైన కరవులు వచ్చెను. హైదరాబాదు నగరములోనే తొమ్మిది వేలమంది చచ్చిరి. ఇండ్లలో చచ్చినవారి మాట లెక్కలేదు. రాయచూరు జిల్లాలో రెండువేలమంది పాలెవాండ్రలో ఆర్గురు మాత్రము కరవు అనంతరము జీవించియున్నట్లు తెలిసినది. దేశమంతయు పుర్రెలతో నిండియుండినందువలన దీనికి పుర్రెల కరవని పేరు వచ్చినది. 1804లో మరల కరవువచ్చెను. అదివరకు రూపాయకు ఆరుశేర్లు అమ్ముచుండిన రాగులు రెండున్నర శేర్లు అమ్ముచుండిరి. కొందరు మనుష్యులనే చంపి తినిరని 'బిల్ గ్రామీ'గారు వ్రాసినారు. మరల 1831లో వచ్చిన క్షామమున పిడికెడు గింజలకు పిల్లలనమ్ముకొనసాగిరి. జొన్నలు రూపాయకు 3, 4 శేర్లు అమ్మిరి. జనులు ఆకులు అలములు తిని జబ్బుపడి చావసాగిరి. 1854లో వచ్చిన కరవులో వీధులు పీనుగులతో నిండెను.

ఈ కరవుల ఫలితముగా ప్రజలు అప్పుల పాలైరి. మార్వాడీలు రైతుల ధాన్యమును కొట్లలో పోసి ధరలు పెంచిరి. అరబ్బులు, రోహిలాలు హైదరాబాదులో రెండువందలఏబది సంవత్సరముల నుండి కని విని ఎరుగని పద్ధతిని నూటికి నాలుగు వందలు వడ్డీని పుచ్చుకొనుచు బాకీలను తీర్చనివారిని పొడిచి చంపి వసూలు చేయుచుండిరి. అరబ్బులు 'రాజారాంబక్షు' అను నిజాంగారి మంత్రిగారికి ఋణమిచ్చి అతడు బాకీ తీర్చకపోగా అతనిని బాధింపసాగిరి. అంతట అతడు నిజాముగారి దివాణములో దాగికొనెను. అరబ్బుల దౌర్జన్యము విరీతముగనుండెను. బాకీలు తీర్చనివారిని జమాదారుల యిండ్లలో పెట్టి అన్నము నీరునివ్వక బాధించుచుండిరి. పటానులును అరబ్బులును జాగీరుదారులకప్పులిచ్చి 80 లక్షల ఆదాయముగల జాగీరులను తమ వశములో నుంచుకొనిరి. హైదరాబాదులో న్యాయస్థానములలో బాకీలకు డిక్రీలు పొంది అమలుచేయు ఆచారము లేనందున కోమట్లకు, వ్యాపారులకు బాకీలు వసూలు కానప్పుడు వారు 'రోహిలాల'ను అరబ్బులను పంపి వారిచేత దౌర్జన్యముగా బాకీలు వసూలు చేయుచుండిరి.

వారు బలవంతముగా సామానులను లాగికొని వచ్చుటగాని, జంబియాలతో పొడిచి వసూలుచేయుటగాని చేయుచుండిరి. రోహిలాలు, అరబ్బులు బాకీలు వసూలు చేయుటకు ఋణగ్రస్తులపైన రాతిబండలుంచి, వాతలుపెట్టి వసూలు చేయుదురు. ఋణగ్రస్తుడు పారిపోకుండ కాపలాయుంచి కాపలావారి కూలిని కూడా వసూలు చేయుచుండిరి. జనులు తమ బాకీల కొరకు పిల్లలను కూడా అమ్ముకొనుచుండిరి.

తెలంగాణములో భూములను గుత్తకిచ్చుచుండిరి. గుత్తదారు రైతుల వద్ద ధాన్యభాగమును తీసికొని సర్కారుకు రూపాయలు రొక్కముగా చెల్లించుచుండిరి. భూములకు నిర్ణీతమైన శిస్తులుగాని, పన్నులుగాని లేవు. దేశపాండ్యాలు, దేశముఖులు మొదలైనవారు భూమి పన్నులనేగాక మగ్గము పన్ను, కలాలీ పన్ను, తోళ్ల పన్ను, పెండ్లి పన్ను, పీనుగుల పన్ను, తోకపన్ను మొదలైన చిల్లరమల్లర పన్నులనేకములను వసూలు చేయుచుండిరి.

ప్రతి గ్రామములోను జాగీరుదారులు వ్యాపారులను బాధించి సరుకులపైన సుంకములను లాగుచుండిరి. అందువలన 1800 మొదలు 1855 వరకును హైదరాబాదు రాష్ట్రమునందు వ్యాపారము క్షీణించెను. హైదరాబాదు ప్రభుత్వము ఆంగ్లేయ సైనికవ్యయము కొరకును, పరిపాలనానిర్వహణ కొరకును అప్పులు చేయుచునేయుండెను. దివాన్ పేష్కారు రాజా చందులాల్‌గారు దేశములోని అరబ్బులు, పఠానులు, గోసాయిలు, సైనిక నాయకులు, స్థానికులైన షాహుకారులు మొదలైనవారందరి దగ్గరను హెచ్చు వడ్డీలకు ఋణములు చేయుచు ప్రభుత్వము సాగించుచుండిరి. క్రమక్రమముగా హైదరాబాదు జిల్లాలపైనవచ్చు రివిన్యూ ఆదాయమంతయూ తాకట్టుపెట్టి ఋణములు తీసుకొనవలసివచ్చెను. విజాతీయ సైనికుల మూకనాయకులు అప్పులిచ్చి తమ సైనికులకు ఉద్యోగములు సాధించుచుండిరి. ప్రజల వలన చాల కఠిన పద్ధతులతో పన్నులు వసూలు చేయసాగిరి. సర్కారుకు ముందుగా సొమ్ము చెల్లించి, నజరానానిచ్చి వివిధ జిల్లాలలో నుద్యోగము చేయుటకు వెళ్ళినవారందరు హైదరాబాదు నగరములో నుండి తమ గుర్రములపైన బోవునప్పుడు వెనుకనేమి జరుగుచున్నదో అని తమ ముఖములను గుర్రపుతోకల వైపునకే త్రిప్పి–కూర్చుండి పోవుచుండిరని ప్రజలు

హాస్యమునకనుచుండిరి. జిల్లాలలో తాలూకాదారులు పోటీలు పడి ఒండొరులతో పోరాడుచుండిరి. ప్రజలను చిత్రహింసలను పెట్టి బాధించి సొమ్ము వసూలు చేయుచుండిరి. పొలముల పైన పైరు కూడా బాకీల కింద జప్తుచేయబడి కోయుటకు వీలు లేనందున పక్షులు తినిపేయుట మూలముగాను, దొంగలు దోచుకొనుట మూలముగాను నశించుచుండెను. హైద్రాబాదు పరిపాలన చాల అధ్వాన్నముగానుండెను. న్యాయపరిపాలన శాఖ, పోలీసు శాఖలందు నీతి లేకపోగా క్రమపద్ధతియైనను లేకుండెను. ప్రభుత్వమువారి సామాన్య దేశీయ సేనలు ఏబది వేలమంది యుండిరి.

ఇందు పదునారు వేలమంది అరబ్బులును, వారికి పుట్టిన సంకరజాతులవారును ఉండిరి. దేశములో అశాంతి ప్రబలెను. రాజబాటల పైన ఖజానాగాని, విలువగల వస్తువులు గాని పోవుచున్నట్లు పసికట్టినచో వానిని దోపిడి దొంగలు బాహాటముగా దోచుకొనిపోవుచుండిరి. అరబ్బులు, రోహిలాలు, సిక్కులు, పఠానులు–మొదలైన విజాతీయుల ఆకతాయి మూకలు హద్దుపద్దు లేక నగరమునందు చెలరేగి ప్రజలను పలువిధములుగా బాధించుచుండిరి. దేశములో ఆలనపాలనలు లేవు. ఈ దేశమును తమ వశము చేసుకొనుటేతప్ప ఇక్కడ శాంతిభద్రతలను క్రమపరిపాలనమును స్థాపించుటకు వేరు మార్గము లేదని బ్రిటిషు ప్రభుత్వమునకు తోచెను. తూర్పు ఇండియా వర్తకసంఘమువారి బ్రిటిషు ప్రభుత్వమునకు కూడా హైదరాబాదు సంస్థానమువారు చాలా సొమ్ము బాకీపడిరి. సేనల జీతము బాపతు బకాయిలు పెరుగుచుండెను. సాధారణముగా నిజాముగారి ఇంగ్లీషు సేనలకు నాలుగు నెలల జీతము బాకీయుండెను. అప్పుడప్పుడింకను హెచ్చునెలల జీతములు బాకీపడుచుండును. ఇదిగాక మహరాష్ట్ర యుద్ధములు జరిగిన పిమ్మట నిజాముగారి వలన స్టయిపెండులు, పించనులు మొదలైన బాపతు సొమ్ము రావలసియుండెను. ఈ పరిస్థితులు దుర్భరములైపోగా రాజా చందూలాల్‌గారు తమ మంత్రి పదవికి 1843లో రాజీనామానిచ్చిరి.

చందులాల్‌గారి తరువాత నిజాముగారు పదేండ్ల వరకు తన బంధువులను చాలామందిని ఒకరి తరువాత నొకరిని ప్రధానమంత్రులుగా నియమించిరి. కాని వారందరు అసమర్థులుగానుండిరి.

దేశ పరిస్థితులు చక్కబడలేదు. ఇంగ్లీషువారు తమ సైనిక దళముల జీతములు క్రిందను తమకు రావలసిన ఇతర బాపతు మొత్తములను రాబట్టుకొనుటకును నిజాముగారి పైన చర్య తీసుకొందురని అందరు ననుకొనసాగిరి. సంస్థానము యొక్క పరిస్థితులును మరింత దుర్భరములయ్యెను. దూరముగానున్న జిల్లాలలో ఆస్తికిగాని, ప్రాణములకుగాని రక్షణ లేకుండెను. 1848లో డాక్టరు బ్రాడ్లీగారిట్లు వ్రాసిరి: 'పోలీసు సిబ్బందియు, దాని వ్యవహారములును ఎంతమాత్రమును బాగుగా లేవు. వారికొక పద్ధతి లేదు. తమకు తోచినట్లు ప్రవర్తించుచుండిరి.'(అవురంగాబాదు గజిటీరు పు. 783.)

'థగ్గులు గ్రామములందు బాహాటముగా జీవించుచు బాటసారుల కంఠములు పిసికి చంపి విశేష ధనమునార్జించి సుఖజీవనము చేయుచుండిరి. కొన్ని గ్రామములవారు శాంతి స్థాపించుటకు వచ్చిన ఇంగ్లీషు సేనల కెదురుతిరిగి పోరాడుచుండిరి. స్థానిక ప్రభువులు కొందరు థగ్గులను పట్టుకొనకుండా తమకాటంకము కలిగించిరని థగ్గుల నివారణకొరకు నియమింపబడిన ఆంగ్లేయోద్యోగియైన కెప్టెన్ రేనాల్డ్సువారు వ్రాసినారు. (Administration of the East India Co., Kaya P. 373.)

సంస్థానమునందు బందిపోటులును, దోపిళ్లును వృద్ధియయ్యెను. రాజ్యములోని చిన్న చిన్న సంస్థానములవారు హైదరాబాదు ప్రభుత్వాధికారములను తృణీకరించి కప్పము కట్టుటకు నిరాకరించి బకాయిలు పెట్టసాగిరి.

ఇట్టి కల్లోలములందు మునిగియున్న హైదరాబాదు సంస్థానమును సంస్కరింపవలెనన్నచో దీనినింగ్లీషు ప్రభుత్వమువారు వశపరచుకొని వారియుద్యోగులద్వారా పరిపాలించుట తప్ప గత్యంతరము లేదని రెసిడెంటుగారైన జనరల్ ఫ్రేజరుగారు వ్రాసిరి. సివిల్ పరిపాలనా శాఖలోను, సైనిక శాఖలోను సంస్కరణములు చేయుట అవసరమని స్పష్టీకరించినారు. అప్పటి గవర్నరు జనరలైన 'డల్‌హౌసీ' ప్రభువు 1848లో యీ రాజ్యము విషయమున ఇంగ్లీషువారు జోక్యము కలిగించుకొనవలసివచ్చునని గ్రహించెను. అయితే రాజ్యమునంతయు వశపరచుకొన నక్కరలేదనియు, బాకీ క్రింద కొన్ని జిల్లాలను స్వాధీనపరచుకొనిన చాలుననియు

నిశ్చయించెను. ఈ సందర్భమున షోరాపూర్, రాయచూర్ జిల్లాలనుగాని, బీదారు పరగణానుగాని వశపరచుకొనుట యుక్తమని అప్పుడు హైదరాబాదు సంస్థానమున నుద్యోగము చేయుచుండిన మెడోస్ టెయిలర్‌గారు సూచించిరి. డల్‌హౌసీ ప్రభువు బీదారును బ్రిటిషువారికి స్వాధీనపరుపవలసినదని నిజాముగారిని కోరిరి. అయితే, తన రాజ్యములో నేభాగమునుగాని ఇంగ్లీషువారికిచ్చినచో తన మర్యాద పోవునని నిజాముగారు గోలపెట్టి, తన స్వంత సొమ్ములో నుండి ముప్పయి లక్షల రూపాయలను 1851 నవంబరు నెలలో ఇంగ్లీషువారి సేనల జీతముల బాకీ క్రింద తాను చెల్లించెను. తరువాత నిజాముగారు తన జవాహరీని వెండి బంగారు వస్తువులను షాహుకారులవద్ద కుదువబెట్టి 80 లక్షల రూపాయలు తెచ్చి సేనలకు రెండు నెలల జీతము క్రింద చెల్లించిరి. హైదరాబాదు రాజ్యము యొక్క పరిపాలనకు కావలసిన సొమ్ము ఆ సంస్థానప్రభుత్వ ఖజానాలో లేదు. నిజాముగారి నేలమాళిగలందు కోట్లకొలది ధనమున్నదని ప్రతీతి. కాని, దాని సంగతి ఎవ్వరికి తెలియదు. సంస్థాన ప్రభుత్వమువారికి కావలసిన సొమ్మును సేకరించుటకు నిజాముగారనేక మార్గములను నవలంబించిరి. అందులో నజరాణాల పద్ధతి యొకటి. ప్రతి తాలూకాలోను, ఏ యుద్యోగము కావలసినవారైనను దానికి ప్రతిఫలము క్రింద కొంత రొక్కమును చెల్లించవలెను. 1850లో హైదరాబాదు, నిజాము రాజ్యముయొక్క రాబడి మొత్తము మూడుకోట్ల రూపాయలలో రెండుకోట్ల 31 లక్షల రూపాయలను సైన్యమే మ్రింగుచుండెను.

1853లో నిజాముగారికి రెండుకోట్ల 70 లక్షల రూపాయలు ఋణముండెను. వెంటనే బాకీలను చెల్లించవలసినదనియు, ఇంగ్లీషు సేనల జీతములను సక్రమముగా చెల్లించుచుండవలసినదనియు, లేనిచో ఇంగ్లీషు దొరతనమువారు మిమ్ములను తమ కాలి క్రింద మట్టిగాచేసి వూరుపేరు లేకుండా చేయగలరనియు గవర్నర్ జనరల్ డల్‌హౌసీగారు నిజాముగారికి కఠినముగా వ్రాసిరి. ఈ సంగతి పార్లమెంటు చర్చలందు వెల్లడింపబడెను. డల్‌హౌసీగారి రహస్యలేఖలలో కూడా యీసంగతి యుల్లేఖింపబడినది.

ఆ వెంటనే కొన్ని జిల్లాలను స్వాధీనపరచనిచో దండయాత్ర చేయుదునని ఆ ప్రాంతములనున్న సేనాధిపతి మేజర్ డేవిడ్‌సన్‌గారు నిజాముగారిని బెదిరించిరి. అంతట తన రాజ్యమే పోవునని భయపడి నిజాముగారు 1853లో బ్రిటిష్ ప్రభుత్వమువారు నిర్ణయించిన రాజీ షరతులకంగీకరించిరి.

1853లో బ్రిటిష్‌వారు నిర్ణయించిన సంధిషరతుల ప్రకారము నిజాముగారు సాలుకు ఏబదిలక్షల రూపాయలు ఆదాయము రాగల నలదుర్గము, రాయచూరు, బీదారు జిల్లాలను ఇంగ్లీషువారికి స్వాధీనపరచెను. దీనికి అసైన్డ్ టెరిటెరీస్ అని పేరు వచ్చినది. ఆ జిల్లాలపై వచ్చు ఆదాయమును ఇంగ్లీషు సేనల జీతము క్రిందను ఇంగ్లీషువారికి పైనచెప్పబడిన బాకీపైన చెల్లించవలసిన వడ్డీ క్రిందను వినియోగించుచుండుటకు నిజాముగారంగీకరించిరి

## 1808-1843 నాటి నిజాం రాజ్య చరిత్రలోని చిత్రకథలు 4

రచన: దిగవల్లి వేంకట శివరావు

మార్చి 2021

## ఆంధ్రుల చరిత్రలో వెలుగు చూడని కొన్ని ఘట్టాలు 4: నిజాం రాజ్యంలో వాణిజ్య పరిశ్రమలు, రాకపోకలు, రవాణాలు

ఇంగ్లీషువారీ దేశములో వర్తకము చేయుటకు వచ్చినప్పటికి దేశమున రవసెల్లాలు జిలుగు వలువలు తయారగుచుండెను. ఈ దేశపు పారిశ్రామికులు తయారుచేయు వస్తువులు చాలా అందముగానుండి మన్నికగలపై పాశ్చాత్యదేశములందు చాలా విలువలకమ్ముడుపోవుచుండెను. అందువలన పాశ్చాత్య వర్తకులు బంగారమునిచ్చి మన వస్తువులు వస్త్రములు కొని ఎగుమతి వ్యాపారం చేయుచుండిరి. మనదేశములోని రాజులను నవాబులను నాశ్రయించి, తామొక్కరు మాత్రమే వ్యాపారము చేసికొను హక్కును పొంది తమకు చౌకగా వస్తువులు నిచ్చునట్లు దేశీయ పారిశ్రామికులను నిర్బంధించుచు పీడింపసాగిరి.

ఈ దేశములోని సైనికులకు క్రమశిక్షణము లేనందున 1757లో జరిగిన ప్లాసీ యుద్ధములోను ఇతర యుద్ధములలోను క్రమశిక్షణముగల ఇంగ్లీషు సైనికులు సులభముగా మనసేనల నోడించగలిగిరి. అదిగాక మన రాజులు నవాబులు ఒండొరులతో పోరాడుకొనుచున్నందున ఇంగ్లీషువారు మన సైనికులనే తర్ఫీదుచేసి రాజులను నవాబులను ఒకరిపైనొకరిని ప్రేరేపించి సులభముగ రాజ్యాక్రమణచేసి తమ వ్యాపారము మరింత లాభకరముగా చేసికొను మార్గములవలంబించిరి.

వర్తకలాభములతోపాటు ఉద్యోగుల జీతముల వలనను లంచములద్వారా దోపిడి చేయుట వలనను కోట్లకొలది సొమ్ము ఇంగ్లాండుకు తరలింపసాగిరి. వారి అదృష్టవశముచేత ఆ సమయముననే ఆవిరి యంత్రములు ఇంగ్లాండులో వెలసి అనేక పరిశ్రమలకు ఉపయోగపడినవి. అంతట హిందూదేశపు చేతిపనివాండ్రకు పోటీగా ఇంగ్లీషు యంత్రములపైన తయారైన వస్తువులను ఇంగ్లీషువారీదేశమునకు తెచ్చి విక్రయించు పోటీవ్యాపారమును ప్రారంభించిరి. తమ రాజ్యాధికారములను పలుకుబడిని ఈ దేశ పరిశ్రమలను నాశనము చేసి తమ పరిశ్రమలను వ్యాపారమును అభివృద్ధి చేసుకొనుటకే ఉపయోగింపసాగిరి. ఇట్లొక్కమారుగా ఆర్థికవ్యవస్థ తారుమారైనది. ఉదాహరణమునకు 1816 నాటికి కూడా భారతదేశములో తయారైన వస్త్రములు దేశములోని ప్రజలందరికి సరిపోవుట అటులుండగా ఆ సాలున మిగిలిన సరుకులో 1659438 నవరసుల విలువగల వస్త్రములు ఎగుమతియైనట్లు ఇంగ్లీషువారి లెక్కలవలన తెలియుచున్నది. 1825 నాటికి ఢాకా మజిలీనుల ఎగుమతి వ్యాపారము పూర్తిగా ఆగిపోయినది. మధ్యభారతములో పొలిటికల్ ఏజంటుగానుండిన కెప్టెన్ విల్కిన్‌సన్‌గారు హైదరాబాదు రెసిడెంటుగానుండిన ఫ్రేజరుగారికి 1838లో వ్రాయుచు ‘నేతగాండ్రు బిచ్చగాండ్ర స్థితికి దిగిపోయినారు. మనము యంత్రములపైన నేసిన నూలుబట్టలను యీదేశములోనికి తెచ్చి ముంచెత్తివేసినందువలన ఈ నేతగాండ్రు నోటి అన్నమును మనము పడగొట్టినాము’ అని ఆ పరిస్థితి స్పష్టముగా వివరించినాడు. (Hyderabad Residency Records Vol. 394 పుట 73)

ఈ అన్యాయపు పరిస్థితి దాపురింపక పూర్వము నిజాము రాజ్యములోని ఔరంగాబాదు పైఠాను జిల్లాలో సరిగంచుల నేతయు నాందేడులో ఢాకా మల్‌మల్ మజిలీనులతో తులతూగు మజిలీను వస్త్రముల పరిశ్రమయు వ్యాప్తిలోనుండెను. మచిలీ బందరు నుండి కాలికోలును, ఉత్తర సర్కారుల తూర్పుకోస్తాలో తయారైన వస్త్రములను ఎగుమతి చేయబడుచుండెను. ఉన్ని కంబళ్ళు పట్టుతివాచీలు ఔరంగాబాద్‌లో నేయుచుండిరి. హైదరాబాద్ సంస్థానములో వరంగల్ జంపఖానాలు తివాచీలు ప్రసిద్ధికెక్కినవి. వానిని 1851లో లండనులో జరిగిన ప్రదర్శనమునకు పంపిరనినచో ఆనాటికి కూడా అవి ఎంతబాగుండెనో, ఎంత ప్రసిద్ధిచెందెనో తెలియగలదు. నూలును పట్టును కలిపినేసిన 'మష్రూ' అనునొకతరహా బట్టను హైదరాబాదులోను గద్వాల సంస్థానములోను నేయుచుండిరి. 'టస్సరు' పట్టుబట్టలను వరంగల్లు, నారాయణపేట, మట్వాడ, హసన్‌పర్తి, కరీంనగర్ జిల్లాలలోని మాధవపురంలలో నేయుచుండిరి. ఇండోరు నిజామాబాద్ మెదక్ హైదరాబాద్‌లోను మహబూబ్‌నగర్‌కు పదిమైళ్ల దూరములోనున్న కోయిలకొండలోను కాగితములను తయారు చేయుచుండిరి. వరంగల్లు, కూనసముద్రము, తిందుర్తి, కొమరమల్లి, నిర్మల, జగిత్యాల, అనంతగిరి, లింగంపల్లి, నిజామాబాదు మొదలగు స్థలములలో ఇనుము కరిగించి ఇనుప సామానులు తయారు చేయుచుండిరి. ఇల్లిందల, ఇబ్రహీంపట్నం, కోనాపురము, చింతలపేట మొదలగు ప్రాంతములలో కూడా ఉక్కు పరిశ్రమయుండెను. హైదరాబాదు, గద్వాల, వనపర్తి, కొల్లాపురములలో 1890 వరకును కూడా కత్తులను తయారుచేయుచుండిరి. గద్వాలలోను వనపర్తిలోను మంచి తుపాకులను తయారుచేసి 20-00లు మొదలు 60-00 వరకు ఖరీదుకు అమ్ముచుండిరి. (చూడుడు చిల్‌గ్రామి, సురవరము ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర పుటలు 443, 444.)

ఆ రోజులలో సామాన్యపు చీర ఖరీదు రెండు రూపాయలుండెను. మష్రుదుస్తులకు పనికివచ్చు 6-1/2 గజముల తాను 13 రూపాయలు మొదలు 45 రూపాయలు వరకునుండెను.

'కలబట్టు' వేసి నేసిన 15 గజముల తలపాగా ఖరీదు 5రూపాయలు ఉండగా 3 గజముల 'కీన్‌కాబు' నూరురూపాయలకు తక్కువకు దొరకకుండెను. ఇంగ్లీషు వర్తకులీ అపూర్వపు

సరుకులను ఎగుమతిచేసి నూటికి నూరురెట్లు లాభముతో ఐరోపాలో అమ్ముకొనుచుండిరి. ఈ దేశీయ పరిశ్రమలన్నియు పైన చెప్పిన సందర్భములలో పూర్తిగా క్షీణించి నాశనములయ్యెను. ఇంగ్లీషువారికి చేతగాని కొన్ని అపురూప చేతిపని పరిశ్రమలు మాత్రము నిలిచినవి. ఉదాహరణమునకు ఉత్తర హిందూస్థానములో వలెనే తెలంగాణములో కూడా 'చిద్రీ' అను వెండిపూత నగిషీవస్తువులు చేయుదురు. రాగి, తగరము, తుత్తునాగము, సీసము కలిసిన పంచలోహములతో తమలపాకుల పళ్లెములు, పాత్రలు, పీకిదానులు, మొదలైన అనేకవిధములైన సామానులు తయారుచేసి దానిమీద చిత్రచిత్రములైన నగిషీలు చెక్కుదురు. వెండిపూత పూయుదురు. ఇది అతి సున్నితమైన పని. పనివాడు తన కళాకౌశలము ప్రదర్శించి ఎంతో నెమ్మదిగా నెన్నో దినములు కష్టపడి ఒకటొక్కటిగా తయారుచేయవలసినదేగాని ఇది యంత్రములపైన వందలకొలదిగా తయారుచేసి ముంచెత్తుటకు వీలైన పరిశ్రమ కాదు. అందువలన నీపరిశ్రమ తెలంగాణములో నేటికిని నిలిచియుండినది.

## రాకపోకలు – రవాణాలు

టెవర్నియరు అను ఫ్రెంచి దేశపు వజ్రముల వర్తకుడు 1636-1662 మధ్య ఆరుసార్లు తూర్పుదేశములలో పర్యటనము చేసి భారతదేశమునందు కూడా ప్రయాణము చేసినాడు. అతడు సూరతునుండి షాజహాను చక్రవర్తి రాజధానియైన ఆగ్రా నగరమునకు 40 రోజులు ప్రయాణమనియు, దానికి 40 లేక 45 రూపాయలు ఖర్చు అగుననియు, సూరతునుండి గోలకొండకు కూడా అంతే దూరమనియు, ప్రయాణమునకంతే ఖర్చు అగుననియు వ్రాసినాడు. ఇంతేకాక సూరతునుండి ఆగ్రాకొక మార్గమున 339 క్రోసుల దూరమనియు, ఇంకొక మార్గమున 415 క్రోసుల దూరమనియు అతడు చెప్పియున్నాడు.

టెవర్నియరు సూరతునుండి వైరా పింపల్నారు, దౌలతాబాదు, ఔరంగాబాదు అష్టిమార్గమున గోలకొండ సుల్తానుగారి రాజధానియైన గోలకొండ – హైదరాబాదుకు 324 క్రోసుల దూరమని వివరించి పింపల్నారునుండి గోలకొండకు మరియొక మార్గమున్నదని కూడా చెప్పినాడు. ఆగ్రా నుండి దౌలతాబాదుకును, అక్కడనుండి గోలకొండకు మార్గమున్నదనియు చెప్పినాడు. అతడు

గోలకొండ నుండి మచిలీబందరుకు ప్రయాణము చేసియుండెను. గోలకొండ నుండి కొల్లేరు వజ్రపుగని దగ్గరకు నూరుక్రోసుల దూరమనియు, గోలకొండనుండి మచిలీబందరుకు పోవు మార్గమధ్యమున ఎత్తయిన కొండలున్నందువలన బండ్లలో ప్రయాణం చేయుటకు వీలులేదనియు వ్రాసెను. సూరతునుండి గోవా పట్టణమునకు 61 క్రోసుల దూరమనియు, అక్కడ నుండి బిజాపురమునకు 85 క్రోసులను 9 దినములలో ప్రయాణము చేయవచ్చుననియు, బిజాపురమునుండి గోలకొండకు 100 క్రోసులున్నదనియు, అది కూడా 9 దినముల ప్రయాణమనియు వ్రాసియున్నాడు.

టెవర్నియరు మచిలీబందరు నుండి కందుకూరు, గూడూరు పులికాట్(ప్రళయకావేరి) మద్రాసుమార్గమున గండికోటకును, అక్కడినుండి తిరుపతిమార్గమున గోలకొండకును పోవుబాటను వర్ణించినాడు. ఇట్లాకాలమున ఆంధ్రదేశమునందు పలుప్రక్కలకు రాకపోకమార్గములుండెను. అయితే అవి నేటి కాలమువలె కంకరవేసిన మంచిబాటలు కావు. సంపన్నులు పల్లకీలలో ప్రయాణము చేయుచుండిరి. కొన్నిచోట్ల ఎడ్లబండ్లు నడుచునుగాని చాలచోట్లనవి నడువవు. సరకులను వేలకొలది ఎడ్లపైనగాని కంచరగాడిదలపైనగాని రెండు ప్రక్కలకు వ్రేలాడునట్లు వీపులపై వేయబడిన సంచుల జతలయందాసరుకులను వేసి తీసికొనిపోవుచుండిరి. ఈ సంచుల జతలకు అసిమిసంచులనియు కంట్లములనియు పేర్లు. ఇట్లు వందలకొలది వేలకొలది జంతువులపైన నీసరుకులను రవాణాచేయు బిడారులు నడుపువారిదొక పెద్ద లాభకరమైన వ్యాపారముగను వృత్తిగనుండెను. అందులో లంబాడీలు సుగాలీలు బ్రింజారీలు–మొదలైన వర్ణములవారు ఉండిరి. వీరిలో ధనవంతులు, బలవంతులు నుండిరని ఒక్కొక్కప్పుడొక బిడారునకింకొక బిడారు ఎదురైనచో ఒకరికొకరు దారినివ్వక తగవులు పెట్టుకొని పోరాడుచుందురనియు ఈ తగవులను తీర్చుటకాదేశమునేలు రాజులే జోక్యము కలిగించుకొనవలసి వచ్చుచుండెననియు టెవర్నియరుగారు వ్రాసినాడు. ఒక్కొక్కరకము సరుకునొక్కొక్క బిడారువారు తీసికొనిపోదురుగాని ఇంకొక సరుకు రవాణా చేయరు. ఆ కాలమున మార్గములందు దొంగల దోపిడీ జరుగుచుండినందున నీరవాణావారికి

ఆయుధపాణులైన సైనికులు సహాయముండిరి. మార్గస్థులుకూడా ఆయుధపాణులైన గుర్రపురౌతులను కాలిబంటులను సహాయము తీసికొనిగాని ప్రయాణము చేయకుండిరి.

విజయనగర సామ్రాజ్యకాలమున మన దేశమునకు వచ్చిన పోర్చుగీసు దేశీయుడగు 'పేయసు' విజయనగరమునకును, భక్తాలువకును మధ్యగల బాటను వర్ణించినాడు. బొల్బోవా విజయనగరము, పులికాటుల మధ్య ఒక బాటయున్నదని వ్రాసిరి. ఆ కాలపు శాసనములు దక్కనుకు తూర్పు సముద్రప్రాంతములకు రాకపోకలుండినట్లు తెలుపుచున్నవి. రోళ్ల మడుగు శాసనము అక్కడి కొండ కనుమకుండా పోవు మార్గములను వివరించినది. అది పులివెందలగండి పెండ్లిమర్రి-మొదలగు వూళ్లమీదుగా పోవుచుండెనట. కైఫీయతులలో కాశీ రామేశ్వరముల బాటయొకటి పేర్కొనబడినది. కడప కవిలెలో తిరుపతి రాజబాట పేర్కొనబడినది. పదునేడవ శతాబ్దమునాటి గ్రంథమైన శుకసప్తతిలో విజయనగరము నుండి కాంచీపురమునకు పోవు బాట చెప్పబడియున్నది. రాచెర్ల కైఫీయతులో గుత్తి, మునిమడుగల మధ్యనున్న బాటయొకటి, యహోబిలము, పోరుమామిళ్ల, బద్దెవోలు, కంభములమీదుగా పోవు బాటయెకటియు వివరింపబడినది. బందరునుండి కోవిలకొండకును, కోవిలకొండనుండి కంపిలికిని బోవు బాటయున్నట్లు రఫీ అహమ్మదు షిరాజు వ్రాసియున్నాడు. (Third Dynasty of Vijayanagara Dr. N. Venkataramanayya.)

ఈ బాటలు కంకర వేసినవి కావు. ఎడ్లు, గుర్రములు నడిచినందువలన, మనుష్యుల రాకపోకలవలన నలిగిన మార్గములే. ఆ కాలములో సరుకులను బండ్లపైనగాని, మనష్యుల తలపైన మూటలుగాను, మనుష్యులు మోయు కావిళ్ళలోను ఉంచి తీసుకొనిపోవుచుండిరి. ఎడ్లపైనను, కంచరగాడిదలపైనను కంట్లముల జతలో సరుకులను ఉంచి వందలు వేలకొలది జంతువుల మీద బిడారులుగా తీసికొనిపోవుటవలన సరుకుల రవాణా చాలా భారీగా జరుగుచుండెనని శాసనములవలనను, పాశ్చాత్యుల రచనలవలనను కూడా స్పష్టపడుచున్నది. శ్రీకృష్ణదేవరాయలవారు రచించిన ఆముక్తమాల్యదలో కూడా ఇట్టి బిడారులు దారిదోపిడిగాండ్రవలన బాధలుపడుట వర్ణింపబడినది. ఆ కాలమున ముఖ్యమైన పూళ్లలో సంతలు జరిగి దేశములోని అన్నిప్రక్కలనుండి వర్తకులు తమ సరుకులను తెచ్చి విక్రయించుట

ఆచారముగానుండెను. పదునెనిమిదవ శతాబ్దమునాటి హంసవింశతిలో రాయలసీమలోను, తెలంగాణములోను, ఉత్తరసర్కారులలోను, మైసూరు, తమిళనాడు ప్రాంతములలోను కూడా యిట్టిసంతలు జరుగు ముఖ్యపట్టణములు రమారమి రెండువందలు వివరింపబడియున్నవి.

1825 నుండి నలుబదేండ్లు హైదరాబాదు రాజ్యములో గొప్పయుద్యోగము చేసిన మెడోసు టెయిలరు అనునాయన 1825-29 మధ్య బొంబాయి, పూనా, అహమ్మదాబాదు నగరము, ఔరంగాబాదుల మధ్యను ఔరంగాబాదు, ఔసా, గుల్బర్గా (కలబగిరి), దండూటి, హైదరాబాదుల మధ్యను, హైదరాబాదు, పరేందా, సదాశివపేటల మధ్యను, బొంబాయి, పూనా, షోలాపూర్, నలదుర్గము, షామినాబాదు, ఏకైతీ సదాశివపేట, హైదరాబాదు మధ్యను గల మార్గములను తన స్వీయచరిత్రలో వర్ణించియున్నాడు. అతడు గుర్రము మీదను, పల్లకీలోను ప్రయాణము చేసినాడు. ఆయన రచించిన 'థగ్గు ఒప్పుకొనిన సంగతు'లను నవలలో నాగపురము నుండి హైదరాబాదుకు రాకపోకలు జరుగుబాటలను, వాని స్థితిగతులను వర్ణించినాడు.

1830-31 మధ్య చెన్నపట్టణములోను, సుప్రీముకోర్టులో ఇంటరుప్రిటరు లేక తెలుగు తర్జుమాలు చేయు యుద్యోగము చేసిన ఏనుగుల వీరాస్వామయ్యగారు కాశీయాత్రకు బయలుదేరిరి. చెన్నపట్నమునుండి తిరువళ్లూరు, దిగువ తిరుపతి, కడప, అహోబళము, శ్రీశైలము, హైదరాబాదు, మేడిచర్ల, యీదలవాయి నిర్మల, ఆదిలాబాదు, యిరానాగపురముల మార్గముననే కాశీ, ప్రయాగ, గయ క్షేత్రములను దర్శించి కలకత్తాకు పోయి అక్కడనుండి కటకము వచ్చి జగన్నాథయాత్ర చేసి గంజాము, బరంపురము, శ్రీకాకుళము, విజయనగరము, సింహాచలము, అనకాపల్లి, నక్కపల్లి, పిఠాపురము, పెద్దాపురము, రాజానగరము, రాజమహేంద్రవరము, వాడపల్లి, ఆచంట, ఏలూరుల మీదుగా మచిలీబందరు చేరి అక్కడనుండి కనగాల, చందవోలు, బాపట్ల, వేటపాలెం, చినగంజాము, అమ్మనబ్రోలు, కరేడు, పంటఅల్లూరు, నెల్లూరు, మనుబ్రోలు, గూడూరు, నాయుడుపేట, సూళ్లూరుపేట, గుమ్మడిపూడి, తిరువళ్ళూరు మీదుగా చెన్నపట్టణము తిరిగివచ్చిరి. వీరు పల్లకీలలో ప్రయాణము చేసిరి. వీరు తమవెంట నూరుమందిని

తీసుకొనిపోయిరి. తాము ప్రయాణము చెసిన మార్గమునందలి బాటల స్థితిగతులు తాము చూచిన వూళ్ళను ప్రజల స్థితిని వర్ణించినారు. (కాశీయాత్ర చరిత్ర 3వ ముద్రణము 1941.)

## న్యాయపరిపాలనము

హైదరాబాదులో ఉన్నత న్యాయస్థానము (హైకోర్టు) 1864లో స్థాపింపబడెను. అంతకుపూర్వము ఆ సంస్థానములోని న్యాయపరిపాలనమంతయు సుభా (నిజాము)యందు నెలకొల్పబడియుండెను. సివిల్ వ్యవహారములను తీర్మానించుటకు అధికారి సుభాగారే. క్రిమినల్ కేసులను విచారించు ప్రధాన అధికారి కొత్వాలు. ఆ సంస్థానమునందలి జిల్లాలలో క్రమమైన న్యాయస్థానము లేకుండెను. వర్తకులు తమ బాకీలను రాబట్టుకొనుటకు రోహిలాలను, అరబ్బులను నియోగించి వారిచేత బలవంతముగా బాకీలు వసూలుచేయుచుండిరి. అందుకొరకు వారు జరుపు చర్యలు చాల దౌర్జన్యపూరితములుగను, అక్రమముగనుండెను. ఆ కాలమున బలవంతులదే రాజ్యముగనుండెను. నిరపరాధులపైన రోహిలాలును, అరబ్బులును జులుము చలాయించుచుండిరి. దేశములో ఆకతాయిమూకలు విజృంభించి దోపిళ్లు చేయుచుండిరి. జిల్లా అధికారులు కూడా వారిని చూచి భయపడుచు వారినుండి తప్పించుకొనుటకు పేరుపొందిన దోపిడిగాండ్ర నాయకులకు పెద్ద మొత్తములు లంచమిచ్చి బ్రతుకుజీవుడాయని కాలక్షేపము చేయుచుండిరి. ఈ పద్ధతిని నిజాముగారి ప్రభుత్వము హర్షించుచుండెను.

1821లో ప్రధానమంత్రియైన నవాబ్ మునీర్ ఉల్ ముల్కుగారు హైదరాబాదు నగరములో దివాని అను పేరుతో నొక క్రొత్త న్యాయస్థానమును స్థాపించిరి. అందులో హిందూపండితులు పరివేష్టించి తగవులు తీర్చుచుండిరి. తరువాత దానినే 'దివానీ-ఏ-బుజుర్గు' లేక హైకోర్టులని మార్చి, సివిల్ దావాలను విచారించు పద్ధతిని స్థాపించిరి. అయితే అందులో మహమ్మదీయ న్యాయాధిపతులను నియమించిరి.

1838లో రాజా చందూలాల్‌గారు దివాను పేష్కారుగానుండగా 'అదాలత్-ఏ-ఫౌజదారీ' అను పేరుతో క్రిమినల్ కేసులను విచారించుటకు నగరములో నొక క్రొత్తన్యాయస్థానమును స్థాపించి తరువాత దానిపేరు అదాలత్-ఏ-ఆలియా లేక సుప్రీం కోర్టు అనియు మార్చిరి.

1845లో సిరాజ్ ఏ ముల్కుగారు మంత్రిగానుండగా న్యాయపరిపాలనా విధానమునందు కొన్ని సంస్కరణములు గావించిరి. అప్పటివరకును నేరములు చేసినవారి కాలుగాని, చేయిగాని ఛేదించు మహమ్మదీయ శిక్షావిధానమును రద్దుచేసి ఏడు మొదలుకొని పదునాలుగు సంవత్సరములవరకు కఠిన కారాగారవాస శిక్షలను విధించు పద్ధతిని స్థాపించిరి.

నవాబ్ సిరాజ్-ఏ-ముల్కుగారు ప్రధానమంత్రియైనప్పుడు 1833లో సహగమనములు నిషేధించుచూ వారొక ఫర్మానా నిజాముగారిచేత చేయించెను. అంతవరకు జరుగుచుండిన పిల్లలను బానిసలుగా విక్రయించు దురాచారమును నిషేధించుచు నిజాముగారిచేత మరియొక ఫర్మానా జారీచేయించెను. దేశములో విచ్చలవిడిగా తిరుగుచు కంఠములకురిపోసి చంపు థగ్గులను, దోపిళ్లుచేయు బందిపోటు దొంగలను పట్టుకొని బహిరంగముగా ఉరిదీయుటవలన నాబాధ కొంత తగ్గెను.

## శాంతిభద్రతలు

హైదరాబాద్ రాజ్యములోని సంస్థానాధిపతులను గూర్చి ఏనుగుల వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్ర చరిత్రలో కొల్లాపురము, వనపర్తి సంస్థానములవారు తరచుగా తగవులాడుచు ఒకరి గ్రామములనింకొకరు కొల్లపెట్టి రైతులను హింసించి గ్రామములను పాడుచేయుచున్నారనియు, అప్పుడు హైదరాబాద్ రాజ్యమున అధికారులుగానున్న చందూలాల్ ప్రభృతులు వీరిని వారించుట లేదనియు వ్రాసినారు. హైదరాబాద్‌లోని ప్రజలందరును ఆయుధపాణులై మెత్తనివారిని కొట్టి నరుకుచున్నారు. షహరులో చంపినా అడిగే దిక్కులేదని వ్రాసినారు.

ఉత్తర సర్కారులోని నిజాముగారి జమీందారులు చాలా దౌర్జన్యము చేసిరని పిండారీలు, మరాటీ దండ్లు దేశమును కొల్లగొట్టుచుండెనని, హైదరాబాదు రాజ్యమున ప్రతిదినము బందిపోట్లు, దొంగతనములు జరుగుచుండెనని, రోహిలాలగుంపులు, దొంగలగుంపులు గ్రామములను దోచుకొనుచుండెనని బిల్‌గ్రామీగారు తమ గ్రంథమున వ్రాసినారు.

1794లో సింధియా మరణించుటతో మహరాష్ట్రులలో అంతఃకలహములు హెచ్చెను. వారు రాజపుత్రులతో పోరాడి వారి రాజ్యమును పాడుచేయుటయేగాక తాము పాడై బలహీనులైరి. 1813 నుండి మహారాష్ట్ర సామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయినది. ఆ సేనలోని సైనికులు జీవనము జరుగక దేశముపైబడి దోచుకొనసాగిరి. వీరిలో మొగలాయీసైన్యము నుండి భ్రష్టులై వెడలివచ్చినవారును, దోపిడి రుచిమరగిన మహమ్మదీయ సైనికులును చేరిరి. వారి స్త్రీలు హిందువుల స్త్రీలవలె వేషములు వేసుకొని దోపిడిగాండ్రతో బయలుదేరుచుండిరి. వీరినందరినీ పిండారీలని వ్యవహరించుచుండిరి. వీరు తెలంగాణముపైనను రాయలసీమపైనను ఉత్తరసర్కారులపైనను కూడా దండుపెడలివచ్చి దురాగతములు చేయసాగిరి. 200 మొదలు 5000 వరకును గుంపులుగా బయలుదేరి గ్రామములు ధ్వంసముచేసి ఇండ్లు తగులబెట్టి, స్త్రీలను చెరచి, పురుషులను చిత్రహింసలుచేసి ధనము దోచుకొనుచుండిరి. వీరికి భయపడి గ్రామములచుట్టును గోడలు కట్టుకొని, కావలివారిని పెట్టుకొని గ్రామస్థులు బాధలు పడుచుండిరి. ప్రతిగ్రామములోను ఎత్తైన ఒక చెట్టుపైననో లేదా పెద్దమేడపైన గట్టిన బురుజులపైన స్తంభముపైననో ఎక్కియుండి ఏ ప్రక్కనుండియైనను గుర్రపుదళములు వచ్చునప్పుడు రేగు దుమ్ము కనపడినచో ఆ కావలిమనుష్యుడు గ్రామస్థులకు తెలియపరచును. తగిన సైనిక బలమున్నచో ఎదిరించుచుండిరి. లేనిచో వూరువదలి పారిపోవుచుండిరి, లేదా పిండారీ నాయకులు కోరిన సొమ్మునిచ్చి తమ మానములను, ప్రాణములను దక్కించుకొనుచుండిరి. ఆ కాలమున స్త్రీపురుషులనుభవించిన బాధలకు మితిలేకుండెను.

పిండారీ సైన్యము 1814లో 21,000 గుర్రపుదళము, 15,000 కాల్బలములు, 18 తోపులు కలదయ్యెను. 1816లో వారు ఉత్తర సర్కారులలో సగభాగములో పదకొండున్నర దినములపాటు

దండయాత్రచేసి 339 గ్రామములను దోచుకొనిరి. 6, 7 వేలమందిని చావగొట్టి, వారు దాచిన ధనముయొక్క జాడలను తెలిసికొనిరి. వారు గుంటూరుజిల్లాలో విపరీతమైన దౌర్జన్యములు చేసిరి. వారి బాధలకు భయపడి స్త్రీలు, పిల్లలు కొందరు ఇండ్లు తగులబెట్టుకొని అందులోపడి చచ్చిపోయిరి. చెరచబడిన స్త్రీలు బావులలోపడి ఆత్మహత్యలు చేసికొనిరి. కొందరు స్త్రీలను పిండారీలు పట్టుకొని తమతో తీసుకొనిపోయి బానిసలుగా అమ్మిరి. కొందరు కృష్ణలోపడి చచ్చిరి. పిండారీలు చేయు చిత్రవధ వర్ణనాతీతములు. కొందరి చేతివ్రేళ్లకు గుడ్డలుచుట్టి నిప్పు అంటించిరి. వేళ్లలో గసినెలు గ్రుచ్చిరి. కారమును, వేడి బూడిదను కళ్లకు, మూతికి కట్టుచుండిరి. ఈ సంగతులను 'రష్‌బ్రూక్ విలియంస్' అను ఇంగ్లీషు గ్రంథకర్తయే వ్రాసినాడు. కొంతకాలమువరకును తూర్పు ఇండియా వర్తకసంఘమువారి ప్రభుత్వము వీరిని అరికట్టలేకపోయెను.

ఈ పిండారీ దండులు నాగపురమునుండి బయలుదేరి హైదరాబాదు రాజ్యమునందలి వివిధ ప్రాంతములపైన చాలా అక్రమములు గావించెను. నిజాముగారి ప్రభుత్వము వీరిని ప్రతిఘటించలేకపోయిరి. కంపెనీ రాజ్యమునందు పిండారీలు వచ్చిపడి ఇంగ్లీషు ఉద్యోగుల ఇండ్లను తగులబెట్టి ఖజానాను తీసుకొనిపోయిరి. గుంటూరులోనే ఇది జరిగెను. తుదకు హేస్టింగ్సు ప్రభువు గవర్నరు జనరలుగా నున్నప్పుడు పిండారీలపైన యుద్ధముగావించి వీరిగుంపులను చెదరగొట్టెను.

పిండారీల బాధ తప్పినను మార్గమునందు ప్రయాణికులను మోసగించి దారిలో వారి కంఠములకురిపోసి చంపు థగ్గుల, దోపిడీదొంగల బాధ మితిమీరెను. వీరి సంగతిని కంపెనీ పరిపాలకులు చాలాకాలమువరకు కనిపెట్టలేకపోయిరి. వీరిని పట్టుకొని అణచుటకు చాలాకాలము పట్టెను. తమ రాజ్యమునందిట్టి ఘోరములు జరుగుచున్నవని ప్రతిసంవత్సరము వేలకొలది అసహాయులైన ప్రయాణికులు దుర్మరణము పొందుచున్నారను సంగతి క్రమక్రమముగా బయల్పడెను. 1831-1836 మధ్య జరిగిన విచారణ ఫలితముగా థగ్గుల ముఠాల నాయకులను పట్టుకొనగలిగిరి. వీరికిని దేశములోని జమీందారులకు జాగీరుదారులకు

గ్రామోద్యోగులకును సంబంధమున్నట్టు కూడ బయల్పడెను. కొంతమంది చిన్న సంస్థానాధిపతులు కూడా వీరికి సహాయముచేసి దోపిడీసొమ్ములోనుండి లాభములు పంచుకొనుచుండిరి. ఈ థగ్గుల నాయకులను పట్టుకొని విచారించి కొందరిని ఉరితీసియు, కొందరికి యావజ్జీవమువరకు శిక్షను విధించియు యీ నేరములు జరుగకుండా కంపెనీ ప్రభుత్వమువారు తీవ్రమైన చర్యలు తీసికొనిరి. అంతట నీబాధ తగ్గెను. రాజబాటలందు ఆయుధపాణులై బహిరంగముగానే ప్రయాణికులపైనను, వర్తకులపైనను ఖజానాను తీసికొనిపోవు సైనికదళములపైననుబడి దోచుకొను 'డాకూ'లను బలవంతులైన దోపిడీదొంగల దళములను అణచుటకై దేశములో వివిధప్రాంతములందు పోలీసు ఠాణాలనేర్పరచి సైనిక పోలీసుబలముల సహాయమున ఆ ముఠాలను పట్టుకొని శిక్షింపసాగిరి. కొంతకాలమున కీదౌర్జన్యములు తగ్గెను. (సశేషం)

## 1808-1843 నాటి నిజాం రాజ్య చరిత్రలోని చిత్రకథలు 5

రచన: దిగవల్లి వేంకట శివరావు

ఏప్రిల్ 2021

## ఆంధ్రుల చరిత్రలో వెలుగుచూడని కొన్ని ఘట్టాలు 5: బుస్సీ దొర రాజ్యతంత్రజ్ఞత

ఔరంగాబాదు నగరము చేరగనే బుస్సీదొరగా రవలబించిన పద్ధతుల వలన అతడొకవంక సుబేదారుగారికి విశ్వాసపాత్రుడైన నెయ్యముగానుండి మరియొకవంక సుబేదారునిపైన సర్వాధికారములను పలుకుబడియు గల యజమానునివలె నుండుటకు వీలైన విధముగానుండెను. ఈ విషయమును మనస్సులోనుంచుకొని యతడు నగరమునకొకప్రక్క కొంచము దూరములో నగరమెల్ల తన ఫిరంగిబారులకు అందుబాటులో నుండువిధముగను, ఎత్తుగానున్న ఒక దుర్గమును తనకును, తన సైనికదళమునకును నివాసముగా నేర్పరచుకొనెను. అక్కడ తన ఫిరంగులను ఆ దుర్గపు బురుజులమీద నెక్కించి అవసరమునుబట్టి వానిని పేల్చుటకు సిద్ధముగానుంచెను.

బుస్సీగారు తన సైనికులను కఠినములైన కట్టుబాటులోనుంచెను. కొన్ని నిర్దిష్టములైన సమయములందు తప్ప వారు దుర్గమునుండి బయటకు పోవుటకు వీలులేదు. అప్పుడు కూడా వారు తమ సైనికాధికారియొద్ద లిఖితరూపమైన అనుమతిని పొంది బయటకు పోవలెను. క్రమశిక్షణ నిబంధనలను ఉల్లంఘించిన సైనికులకు కఠినములైన శిక్షలు విధించునట్లు బుస్సీగారు శాసించిరి. అందువలన సైనికులు చాలభయభక్తులతోనుండిరి. దీనివలన చాలలాభము కలిగెను. బుస్సీగారి సైనికులెవ్వరును త్రాగి నగరవీధులందు అల్లరిచేయుటగాని, ప్రజలతో పోరాడుటగాని, తగవులు పెట్టుకొనుటగాని జరుగుటకవకాశము లేకుండపోయెను. ఫ్రెంచి సైనికుల రక్షణ క్రింద చాల విలువగలిగిన అమూల్యములైన సరుకులు కూడా నిర్భయముగా బయటపెట్టుకొని క్రయవిక్రయములు జరుపుకొనుటకు జనులకు వీలుకలిగెను. ఔరంగాబాదులో నీసైనికులు ప్రదర్శించిన సత్ప్రవర్తన యొక్క ఫలితముగా వీరి శౌర్యమును చూచి అదివరకు కేవలము వీరిని భయముతో చూచుచుండిన ప్రజలు వీరి మర్యాదయూ, మంచితనమునూ చూచి, వీరిని మెచ్చుకొని వీరిని గౌరవింపసాగిరి.

సుబేదారుగారితోను, ఆయన దర్బారులోని ప్రభువులతోను జరిపిన రాజకీయ వ్యవహారములందు సైతము బుస్సీగారు చాలా శక్తిసామర్థ్యములను ప్రదర్శించెను.

సలాబతుజంగుగారు చాలా మెత్తనివాడు. హైదరాబాదు రాజ్యపరిపాలనము ఢిల్లీ చక్రవర్తికి లోబడిన ప్రభుత్వమేయైనను, అది చాలవరకు పైవారి ప్రమేయము లేకుండ స్వతంత్రముగా జరుగు ప్రభుత్వముగానుండెను. అయితే, బలవంతుడైన చక్రవర్తి ఏ క్షణమునకైనను దక్కను సుబేదారును త్రోసిరాజనవచ్చును. అందువలన నీప్రభుత్వము సుస్థిరమైనదని చెప్పుటకు వీలులేదు. ఇదిగాక, ఇరుగుపొరుగుననున్న బలవంతులైన మహారాష్ట్రులు ఏ సమయముననైన నీరాజ్యముపైనబడి కొల్లగొట్టగలరు. ఈ రాజ్యపాలకుడు బలహీనుడైనగాని, నిలుకడ లేనివాడైనగాని, శక్తిసామర్థ్యములు, బుద్ధిబలము లేనివాడునైనగాని, అతడు కేవలము అదృష్టదేవత చేతి కీలుబొమ్మయగును, లేదా బుద్ధిబలముగలవాడెవ్వడైన అతనిని వశముచేసుకొన్నచో అతని చేతిలోని కీలుబొమ్మయగును. సలాబతుజంగుగారు

స్వభావమునుబట్టి బలహీనుడు, అసమర్థుడు, నిలకడలేనివాడు, భోగలాలసుడునని బుస్సీగారు త్వరలోనే కనిపెట్టిరి. అంతట అతనికి సారథ్యముచేయు బుద్ధిబలముగల సలహాదారుయొక్క స్థానమును తానే ఆక్రమించుటకు నిశ్చయించెను. తనక్రిందనున్న సైనికబలముయొక్క సహాయమున తానాస్థానమును సులభముగా నాక్రమించుట కవకాశముండెను. అయితే పొరబాటుననైనను తన సైనికబలముయొక్క దంష్ట్రలను బయటకు ప్రదర్శించగూడదని బుస్సీగారు ఎరుగును. అందువలననే అతడు తన సైనికదళమునట్లు దుర్గమునందు మూసిపెట్టి మర్యాద, నెమ్మదిని ప్రదర్శించుటలో వారికి క్రమశిక్షణము నొసగెను. అందువలన నాసైన్యము యొక్క నైతికబలము పదిరెట్లు పెరిగెను. ఈ సైన్యము పైననెవ్వరికీ అనుమానము, అసహనము కలుగక పోవుటయేగాక, వారి సేనానాయకుని యాజమాన్యమున ఇంతవరకు వారెంత గొప్ప కార్యములను సాధించిరో ఇకముందుకూడా ఎంతటి గొప్ప కార్యములను సాధింపగలరో అతడొక్కమాట పలికినచో వారెంత సాహసకృత్యములను చేయగలరో అందరికినీ పూర్తిగా తెలిసెను. ఇంతటి శక్తిసామర్థ్యములు గల సైనికబలమును ఇంత కట్టుబాటులో నుంచగలిగిన సేనానాయకుడైన బుస్సీగారి శక్తికి ఆ సైన్యముయొక్క ఉనికియే మరింత బలము చేకూర్చెను.

బుస్సీగారు తన కార్యసాధన విధానమున కేవలం సైనికబలముపైననే ఆధారపడి యూరకుండలేదు. అది అతని పలుకుబడికిని అధికారమునకును పునాదియైనమాట నిజమే. అంత బలవత్తరమైన స్థానమును పొందిన మరియొక సామాన్యవ్యక్తియైనచో దానిని వృథాచేసి యుండెడివాడు. బుస్సీగారికీ విదేశీయుల స్వభావము, చిత్తవృత్తి బాగా తెలియును. అతడా ఎరుకవలన లాభమును పూర్తిగా వినియోగించుకొనదలచెను. అతడు సరసుడును ధారాళమైనవాడును, సౌమ్యుడునునైనప్పటికిని పట్టుదలయు, దూరదృష్టియుగల కార్యశూరుడు. భారతదేశములో చాలాకాలము నుండి ఉన్నవాడు. ఉత్తమవంశీయులైన భారతీయులతో కలసిమెలసి జీవించినందువలన వారి ప్రకృతిని స్వభావమును బాగుగా ఎరిగియుండెను. పైగా అతడు నిర్వహింపవలసిన కార్యముయొక్క విధానమతని కిదివరకే సిద్ధముగానుండెను. పాండుచేరి నుండి బయలు దేరినప్పుడే క్రొత్తసుబేదారుడైన ముజఫర్‌జంగ్‌తో వ్యవహరింపవలసిన పద్ధతిని డూప్లేగారు నిర్ణయించి అతనికి చెప్పియుండిరి. ముజఫర్‌జంగు స్థానమున అతనికన్న

మెత్తనివాడైన సలాబతుజంగు సుబేదారుడైనందువలన డూప్లేగారు చెప్పిన పద్ధతులనెల్ల అతడిప్పుడింకను సులభముగా తు.చ. తప్పకుండా నిర్వహింపకలిగెను.

భారతదేశ పటమును చూచినవారికి ఫ్రెంచి రాజ్యనీతిజ్ఞులు ఆలోచించి వేసిన పథకము ఎంత సులభసాధ్యమో తెలియగలదు. అల్లకల్లోలములందు మునిగి యొక క్రమపద్ధతిలేని మొగలాయి సామ్రాజ్య ప్రభుత్వమునకును ఈ దక్షిణాపథమునకును మధ్య వింధ్యపర్వత పంక్తి యడ్డుగానుండెను. ఈ దక్షిణాపథ రాజ్యమునకు పరిపాలకుడైనవాడు దక్షిణదేశమునకంతకును ప్రభువగుటకు తగిన స్థానముననుండెను. అతనికి పెద్దసైన్యముండెను. యుద్ధము చేయగల జనములా రాజ్యమునన్నున్నారు. ఇతడు కర్నాటక రాజ్యమునేలు నవాబుపైన అధికారముగల ప్రభువు. ఆ రాజ్యమునకు సంబంధించినంతవరకు మొగలాయి చక్రవర్తికున్నంత యధికారమతనికుండెను. అందువలన అతనికి అవసరమైన నైతికబలము, బలప్రయోగ అధికారము నుండుటయేగాక అట్టి బలప్రయోగమున కవసరమైన సైన్యము కూడ ఉండెను. ఆ కాలములో మొగలు చక్రవర్తి పేరునకుగల గౌరవమును, పలుకుబడియు అమితమైనవిగనుండెను. పాశ్చాత్యవర్తకులకా కాలమున వూరు పేరు లేదు. అందువలన నీరెండు విధములైన అధికారములును పలుకుబడియు కలిగియున్నవారికి అలవికాని కార్యములేదు. ఇట్టిపరిస్థితులలో ఈ అధికారమును పలుకుబడియుగల దక్కను సుబేదారుని తమ వలలో వేసికొనిన ఫ్రెంచివారు తమతో పోటీచేయు ఇంగ్లీషు వర్తక కంపెనీవారిని దేశమునుండి వెడలగొట్టవలెనని ప్రయత్నించినచో నాశ్చర్యమేమున్నది. దక్కను హైదరాబాదులోని జుమ్మా మసీదు బురుజులను వశముచేసుకొని కర్నాటకము స్వంతముగ చేసికొనినవారికి ఢిల్లీలోని నెమలి సింహాసనము కూడా కనుచూపుమేరలో కనబడి రాజ్యాక్రమణ మార్గమును చూపించి కార్యసాధనకు ప్రోత్సహించుటలో నాశ్చర్యమేమున్నది. ఫ్రెంచివారికి త్వరలోనే సామ్రాజ్య స్థాపనను గూర్చిన ఆలోచనలు కలిగినవి. ఈ ఆలోచనలలో నింకొక గొప్ప విశేషమేమనగా నిది సులభసాధ్యముగ కూడా కనపడెను.

దేశీయుల చిత్తవృత్తులను చక్కగానెరిగియున్న డూప్లేగారు ప్రస్తుతము దక్షిణాపథమునేలుచున్న సుబేదారుడు ఫ్రెంచివారిపట్ల కృతజ్ఞుడైయున్నప్పటికిని ఈ ఫ్రెంచివారికి గల శక్తిసామర్థ్యములును వారి బలాధిక్యతయు నతని కన్నులయెదుట సదా ప్రదర్శింపబడుచున్నగాని అతడిదియెల్ల త్వరగా మరచిపోగలడని కూడా డూప్లేగారికి తెలియును. అందువలననే కేవలము ముజఫర్‌జంగ్‌కు సహాయము చేయగలందులకేగాక దక్కను సుబేదారుని దర్బారులో ఫ్రెంచివారి బలమును, పలుకుబడిని స్థాపించియుంచుటకే డూప్లేగారు బుస్సీగారికి ఫ్రెంచి సైనికదళమునిచ్చి ముజఫరుజంగుతో పంపియుండిరి. యుద్ధకౌశలము రాజ్యతంత్ర నైపుణ్యము గల ఫ్రెంచియధికారి క్రింద ఫ్రెంచివారి సైన్యము సుబేదారుని రాజధాని నగరమున నుండుటవలన ఆ సుబేదారునియొక్క అధికారమునకు తోడ్పడుటయేగాక ఆ సుబేదారుడు తన పదవిని కాపాడుకొనుటకొరకు ఆ సైనిక బలముపైన నాధారపడు స్థితి సంభవించినచో చాలా లాభకరముగనుండునని డూప్లేగారికి తెలియును. ఇంతేగాక రాజ్యతంత్ర నిపుణుడైన సేనాధిపతి సమర్థుడును తెలివైనవాడునైనచో ఆ రాజ్యములోని పలుకుబడియంతయు తన క్రింద కేంద్రీకరింప జేసికొనగలుగును. రాజకీయ వ్యవహారములకు సూత్రధారుడుగ నుండును. నిజమునకు దక్కను సుబేదారుని కీలుబొమ్మగ చేసి రాజనగరునందు నియంతకాగలడు. డూప్లేగారి యధ్వర్యమున పంపబడిన బుస్సీదొరగారు సమర్థుడైన సేనాధిపతియు రాజ్యతంత్రజ్ఞుడునని చరిత్రప్రసిద్ధుడైనాడు.

## నిజాం దర్బారు

ఈ పరిస్థితులలో ఘూజీయుద్దీన్ తీరుబడి చేసికొని ఢిల్లీనుండి దక్షిణాపథమువరకు తరలివచ్చెను. అంతట సలాబతుజంగు భయపడెను. అయితే ఘూజీయుద్దీను బాధ త్వరలో తీరిపోయెను. అతని సవతితమ్ముడైన నిజామలీగారి కన్నతల్లి ఘూజీయుద్దీను తన కుమారునికి అడ్డురాగలడని తలచి పైకి చాలాప్రేమను చూపి తాను వండిన వంటకమని చెప్పి ఘూజీయుద్దీనుకు విషము పెట్టగా నతడు 1752 అక్టోబరులో దుర్మరణము చెందెను. అంతట బుస్సీగారు అతనికిదివరకు

స్నేహితులుగానున్న మహారాష్ట్రులకు సలాబతుజంగుగారిచేత కొంత రాజ్యభాగమిప్పించి రాజీ చేసెను.

మహారాష్ట్రులతో సంధిజరిగి దేశములో శాంతి యేర్పడిన పిమ్మట బుస్సీగారు అదివరకే ఫ్రెంచివారి స్వాధీనమందున్న మచిలీపట్టణము పరగణాకు దగ్గరలోనున్న కొండవీడు పరగణాను ఫ్రెంచివారి కివ్వవలసినదని కోరగా సుబేదారు ఇచ్చివేసెను. ఇది చాలా స్వల్పమైన బహుమతి అనియు ఇంక కొంత రాజ్యము నివ్వవలసినదనియు బుస్సీగారతని నడగదలచిరి కాని ఇంతలో మరల మహారాష్ట్రులు దండయాత్ర చేసి దేశమును కొల్లగొట్టిరి. బీరారు దగ్గరనున్న రాజ్యభాగమును రఘోజీకిచ్చి రాజీ పడవలసినదని బుస్సీగారు సుబేదారునికి సలహాచెప్పిరి. దీనివలన సుబేదారుగారి నౌకరులలో చాలామందికి జీతబత్తెములును లాభములును పోయినవి. అందువలన గొప్పప్రభువులైన షానవాజఖాను మొదలగువారికి బుస్సీగారిపైన అసహ్యము కలిగెను. నిజాముల్ముల్కుగారి దివాను సయ్యదులష్కరుఖానుగారికిని ద్వేషము కలిగినది. అతడు చాలా తెలివైనవాడు సమర్థుడు. అతడు సుబేదారుగారి సైన్యమునకు అధికారి. నాజరుజంగుగారు అతని సలహా విననందువలననే అట్లు నాశనమైనాడని చాలామంది అభిప్రాయపడిరి.

ఫ్రెంచివారికి సుబేదారుడిట్లు దానోహముచేయుట ఆయనకు గిట్టకుండెను. బుస్సీగారికింత పలుకుబడియుండుటయు నతడు సహింపలేకుండెను. గాని పైకిమాత్రము చాల మర్యాదగానుండెను. అందువలననే అతనిని దివానుగా నియమింపుమని బుస్సీగారు సుబేదారుగారికి సిఫారసుచేసిరి. సయ్యదు లష్కరుఖాను దివానై అతని అధికారములు బలపడగానే యతడు తన నిజోద్దేశములను బయల్పరచెను. బుస్సీగారి సలహా ప్రకారము వ్యవహారములను జరిగింపక పోవుటయేగాక బుస్సీగారి సలహానుబట్టి సుబేదారుగారు జారీచేసినట్లు తనకు అనుమానము కలిగిన యే ఉత్తర్వులను కూడా సరిగా అమలుజరుపకుండెను. ఫ్రెంచివారి కోరికలు మితిమీరుచున్నట్లు అతనికితోచెను. అందువలన నతనికి వారిపైన ద్వేషము కలిగెను. బుస్సీగారికి 1753 ప్రారంభంలో జబ్బుచేసెను. అతడు

జనవరి నెలలో తన సైన్యమునొక సహాయోద్యోగిక్రింద నక్కడనుంచి తాను విశ్రాంతి తీసికొనుటకై సముద్రతీరముననున్న మచిలీపట్టణమునకు పోయెను. అతడక్కడ నుంచిన ఫ్రెంచియుద్యోగి సమర్థుడు కాడు. దర్బారులో జరుగు కుట్రలకు అతడు తట్టుకొనలేకపోయెను. సలాబతుజంగుకు తెలివితేటలును ధైర్యసాహసములును గూడా తక్కువగానేయుండెను. కుట్రదారులవలన అతనికేయపాయము కలుగకుండగను, శత్రువులవలన భయములేకుండగను ఫ్రెంచి సైనికులు అతనికి అంగరక్షకులుగానుండి అతనిని కాపాడుదురని బుస్సీగారతనికి మంచి నమ్మకము కలిగించియుండిరి. అందువలననే తన దగ్గరనుంచుకొనిన ఫ్రెంచి సైనికదళములకు తోడు 5వేల మంది దేశీయ సైనికులను కూడా బుస్సీగారక్కడ చేర్చియుండిరి. ఈ సేనను సుబేదారునికి దూరముగానుంచి అతనికి భయముతీర్చి వారిమీద నాధారపడు అలవాటును తప్పించవలెనని దివానుగారొక ఉపాయము నాలోచించిరి. ఆ సైన్యమునకు జీతబత్తెములు సరిగానివ్వక రాజ్యములోనుండి సొమ్ము సరిగా వసూలగుటలేదని చెప్పి కొన్నాళ్ళు కాలక్షేపము చేసి ఫ్రెంచి సైనికులనే పంపి శిస్తు బాకీలను వసూలుచేయుట తప్ప వేరుమార్గము లేదని సుబేదారునికి చెప్పి ఈ సేనలను వివిధ జిల్లాలలోనికి పంపవలసినదని ఆయన కోరెను.

సలాబతుజంగు ఈ సైనికులను దూరమునకు పంపుటకు అంగీకరించువాడు కాదుగాని అక్కడ బుస్సీగారులేని కాలము నందీసైనికులలో క్రమశిక్షణము క్షీణించి నగర పరిసరములందు వారు అల్లరులు చేయుచుండిరి. దీనినిగూర్చి ప్రజలువచ్చి ఫిర్యాదులు చేసి తమకు న్యాయము కలిగింపుడని సుబేదారుగారి భవనద్వారమువద్ద మొరపెట్టుకొనసాగిరి. అందువలననే సైనికులను గ్రామాంతరములకు పంపుట కతడంగీకరించెను. ఈ సైనికులనిట్లు నలుదిక్కులకు పంపి సుబేదారుగారు హైదరాబాదు నుండి ఔరంగాబాదు పోవుట అవసరమని చెప్పి కొద్దిమంది ఫ్రెంచి సైనికులను మాత్రము వెంటబెట్టుకొని వెళ్లి మిగిలినవారినందరిని గోలకొండలోనేయుంచి వారికి సరిగా జీతములివ్వవలదనియు వారినితరవిధములుగా నేడిపింపుమనియు గోలకొండలో కోటయొక్క పరిపాలకునితో దివానుగారు రహస్యముగా చెప్పియుండిరి. ఇట్లీ సైనికులను బాధలుపెట్టినచో వారు తమంతట తామే పనిమానుకొని పోవుదురని యతనియూహ. అంతట ఫ్రెంచి సైనికులును దేశీయ సిపాయిలును కూడా గోలపెట్టసాగిరి. ఫ్రెంచి సైనికోద్యోగులు మాత్రము

ఎన్ని చిక్కులు కలిగినను తమ యుద్యోగ విధులను నిర్వర్తించుచు బుస్సీగారిని తక్షణమే బయలుదేరి రమ్మని ఉత్తరము వ్రాసిరి. బుస్సీగారి యారోగ్యమింకను కుదుటబడకున్నను అతడు జులైనెలలో తిరిగివచ్చెను. 500మంది ఫ్రెంచి సైనికులు 4000మంది దేశీయ సిపాయిలు హైదరాబాదు నగరములో బారులుతీర్చి నిలువబడిరి. బుస్సీగారు రాగానే గోలకొండ పరిపాలకుడు భయపడి సైనికులకివ్వవలసిన జీతబత్తెముల బకాయిని వెంటనే చెల్లించెదననెను. అయితే తనదగ్గర నప్పుడు సొమ్ములేదని జెప్పెను. అప్పుడు బుస్సీగారు తన పలుకుబడి వినియోగించి షావుకార్ల దగ్గర కొంతసొమ్ము ముందుగా సేకరించి తన దగ్గరున్న సొమ్మును దానికి చేర్చి సైనికుల అక్కరను తీర్చి అప్పటికి వారిని సంతృప్తిపరచి అల్లరి జరుగకుండాచేసిరి. తరువాత ముందు జరుగవలిసిన కర్తవ్యము నాలోచించిరి.

దివానుగారు తమతో ఔరంగాబాదుకు వచ్చిన చిన్న ఫ్రెంచి దళమునకు కూడా సరిగా జీతబత్తెములనివ్వక బాధించినారు. బుస్సీగారీసంగతి తెలిసికొని ఉపాయము నాలోచించెను. వర్షములు తగ్గగానే సెప్టెంబరులో తన యావత్తు సైన్యమును వెంటబెట్టుకొని ఔరంగాబాదు బయలుదేరి వెళ్లుటకు నిశ్చయించిరి. గోలకొండకు ఔరంగాబాదుకు 300 మైళ్ల దూరమున్నది. అతడు అక్టోబరులో బయలుదేరుటకు సన్నాహముచేసెను. దివాను సయ్యదు లష్కరుఖానుగారు బుస్సీగారిపట్ల విరోధించియున్నను ఔరంగాబాదులోని ప్రభువులు కొందరాయనపట్ల స్నేహభావము కలిగియుండిరి. సలాబతుజంగుగారా సమయమున తమ సైన్యమునకు బకాయిపడిరి. మహారాష్ట్రులు మరల వచ్చిపడుదురను భయమాతనికుండెను. బుస్సీగారిట్లు వచ్చుచున్నారను వార్త సుబేదారుని దర్బారులో గొప్ప అలజడి కలిగించెను. దివానుగారికి భయము కలిగినది. మొదట ఔరంగాబాదుకు ఎనిమిదిమైళ్ల దూరమునగల దౌలతాబాదు కోటకుపోయి తలదాచుకొందమని అతడనుకొనెను. గాని తరువాత బుస్సీగారితో సఖ్యతపడుటయే మంచిదని అతనికి తోచెను. అంతట నతడాయనతో రాయబారము నడిపి తనయధికారముద్రలను బుస్సీగారి వశము చేసెదననియు ఆ పదవినింకెవ్వరికైన నిప్పించుమనియు తానతడు చెప్పినట్లు వినెదననియు దివానుగారు కబురంపిరి. బుస్సీగారిదియెల్ల నాటకమని గ్రహించిరి. నిజముగా నతనిని తొలగించినచో తాను అన్యాయము

చేసినట్లు ఇతరులనుకొందురని అతడు ఎరుగును. తనజాతివారికి కావలసిన లాభము సంపాదించుటయే అతని ముఖ్యోద్దేశముగాని ఎవరికిని అపకారము చేయుట అతని యుద్దేశము కాదు. అందువలన తనకతనియందు విరోధభావము లేదనియు ఉభయులు కలసి అన్ని వ్యవహారములు సఖ్యతగా పరిష్కరించుకొనవచ్చుననియు కబురంపిరి. ఉభయులు కలసికొనునప్పుడు జరగవలసిన లాంఛనములు, మర్యాదలు కూడా బుస్సీగారు నిర్ణయించిరి.

బుస్సీగారు ఔరంగాబాదుకు వచ్చు దారిలో చాలా దినములు మకాముచేసిన పిమ్మట నానగరమునకు 8 మైళ్ళ దూరములోనుండగా 1753 నవంబరు 23వ తేదీన దివాను సయ్యదు లష్కరుఖానుగారు 21 మంది గొప్ప ప్రభువులతో ఏనుగులెక్కి తమ పరివారజనము వెంటరాగా బుస్సీగారికెదురుగా వచ్చిరి. ఈ వింత సమావేశమును చూచుటకు వచ్చిన చాలామంది పురజనుల సమక్షములో బుస్సీగారికి ముందుగా సలాముచేసిరి. అంతట అందరును ఏనుగులు దిగిరి. బుస్సీగారును ఏనుగునుండి కిందికి దిగి సయ్యదు లష్కరుఖానుగారిని కౌగలించుకొనిరి. తరువాత తక్కినవారిని కౌగలించుకొనిరి. అటుపిమ్మట అందరును మరల ఏనుగులెక్కి సైనికపద్ధతి వరుసలో సుబేదారుగారి సమక్షమునకు వెళ్లిరి. ఆయన ఈ సందర్శన స్థలమునకు కొంతదూరముననే చాలామంది పరివారముతో నొకగుడారములో వేచియుండిరి. బుస్సీగారు రాగానే సుబేదారుగారాయనను కౌగలించుకొనిరి. అంతట వారి గౌరవార్థము ఫ్రెంచి ఫిరంగిదళములవారు ఫిరంగులను తుపాకులను ప్రేల్చిరి. గుడారమునందు ఆశీనులైన పిమ్మట బుస్సీగారు సుబేదారుగారికి నజరును సమర్పించిరి. అందులో చాలా ఏనుగులును కొన్ని గుర్రములును నగలును ఉండెను. ఆయన ఉద్యోగులు కూడా అట్లే సుబేదారుగారికి బంగారు మొహరీలను నజరుగా సమర్పించిరి. అటుపిమ్మట సుబేదారుగారు లేచి బుస్సీదొరగారి చెయ్యిపుచ్చుకొని గుడారము వెలుపలకువచ్చిరి. సుబేదారుగారు ఏనుగునెక్కుటలో బుస్సీగారు ఆసరానిచ్చి ఎక్కించిరి. తరువాత బుస్సీగారును తమ ఏనుగును ఎక్కిరి. అంతట అక్కడి ప్రభువులందరును తమతమ ఏనుగులనెక్కిరి.

ఇట్లు ఏనుగులు గుర్రములనెక్కిపోవుచున్న వారి వరుసలో గొప్ప ప్రభువులు సేనాధిపతులు మొదలైన అధికారులు ఇతర సైనికులును వారివెనుక హిందూస్థానములోనికెల్ల గొప్ప నగరమైన ఔరంగాబాదులోని పురప్రముఖులును కలిసి నదియొక గొప్ప ఉత్సవపుటూరేగింపు వలెనుండెను. వీరందరునిట్లు మహావైభవముతో ఔరంగాబాదు కోట చేరులోపల వీరి గౌరవార్థము ఫ్రెంచి ఫిరంగిదళమువారు మరలమరల ఫిరంగులు పేల్చసాగిరి. సుబేదారుగారు దర్బారుతీర్చి తమ మస్నదుపైన ఆసీనులు కాగానే తమకు బుస్సీగారిదివరకిచ్చిన బహుమతులవంటివే తాము మరల ఆయనకిచ్చి గౌరవించిరి.

తరువాత దర్బారును చాలించిరి.

అటుపిమ్మట బుస్సీగారు సయ్యదు లష్కరుఖానుగారింటికి వెళ్ళి తమ రాజీషరతులన్నింటిని వివరింపగా నతడు వానికన్నిటికీ నంగీకరించి వానిని సక్రమముగా జరిగింతునని ప్రమాణము చేసెను. ముస్తఫా నగరము, ఏలూరు, రాజమహేంద్రవరము, చికాకోలు సర్కారులను సుబేదారువారు ఫ్రెంచివారి సైన్యముయొక్క పోషణవ్యయమునకై యొసగునట్లును ఆ సర్కారులకప్పుడు పరిపాలకుడుగా నుండిన జఫరలీఖాను ఆ పరగణాలలో అప్పటికి వసూలుచేసిన సొమ్మును ఫ్రెంచివారికి చెల్లించుటలో జాగుచేసినచో సుబేదారుగారి ఖజానాలోనుండి ఆ సొమ్ము భర్తీచేయుదుమని దివానుగారు వాగ్దానము చేసిరి. ఫ్రెంచి సైన్యములు పూర్వమువలె సుబేదారుగారి సంరక్షణము నిమిత్తముపయోగింపబడుటకు అంగీకరించిరి. ఆర్కాటు పరగణా వ్యవహారములందు సుబేదారుగారి దివానుగారు జోక్యము కలిగించుకొనకుండుటకు అంగీకరించిరి. ఇతర వ్యవహారములన్నియు బుస్సీగారి సలహాతో జరిగించుచుండుటకును అంగీకరించిరి. దీనికి ప్రతిఫలముగా బుస్సీగారు సయ్యదు లష్కరుఖానుగారి దివానుగిరీ అధికారములను బలపరచుటకు ప్రమాణముచేసిరి.

అనుకున్న ప్రకారము నాలుగు సర్కారులకును పట్టాలను వెంటనే తయారుచేసి బుస్సీగారికి సమర్పించగా బుస్సీగారు వానిని మచిలీపట్టణములోనున్న ఫ్రెంచి అధికారియైన మొరాసీనుగారికి పంపించిరి.

## ఆంధ్రుల చరిత్రలో వెలుగుచూడని కొన్ని ఘట్టాలు 6: తన అధికారాన్ని నిలబెట్టుకోడానికి సలాబత్‌జంగ్ ఆడిన నాటకాలు

ఇక్కడనిట్లు ముజఫర్‌జంగుగారు దుర్మరణము పొందగా అతనికి కొంతవెనుకనుండి వచ్చుచున్న ఫ్రెంచి దళమువారు అతడింకను విజయుడై వెనుకకు మరలివచ్చునని నిరీక్షించుచుండిరి. అతని మరణవార్త వారికి సంభ్రమాశ్చర్యములు కలిగించెను. వారు దుఃఖముతో వెనుతిరిగి శిబిరమునకు వచ్చిరి. అక్కడనంతయు నల్లకల్లోలముగ నుండెను. అప్పటికే సేనలలోని సైనికులకు జీతబత్తెములు బాకీయుండెను. అందువలన వారు పితూరీచేసి సుబేదారుగారి ఖజానాపైబడి దోచుకొనెదరని సేనాధిపతులకు భయముకలిగెను. సేనాధిపతులందు కూడా ఒకరిని చూచిన యింకొకరికనుమానము కలుగసాగెను.

ఈ దుర్ఘటనమువలన తక్కినవారందరి మాట అట్టుండగా ఫ్రెంచివారు పెట్టుకొనిన యాశలన్నియు అడుగంటినట్లు కనబడెను. నాజరుజంగు హత్యవలన వారికి లభించిన రాజ్యాధికారములు సౌకర్యములు చేయిజారిపోవుచున్నట్లు కనబడెను. ఈ సుబేదారీ వ్యవహారములందు జోక్యము కలిగించుకొనుటకు బుస్సీగారికింకేమి హక్కున్నది? ఏ నెపమున నెవరినడ్డుపెట్టుకొని అతడు మాటలాడగలడు? అంతట నీ సంగతులన్నియు నీ బుద్ధిశాలి మనస్సులో మెరపుపెరసినట్లయ్యెను. అయితే అతడు తత్తరపాటు చెందక, ధైర్యము విడనాడక కర్తవ్యమునాలోచించెను. ఏదోవిధముగా మరల ఫ్రెంచివారి మాటవినునతనిని సింహాసనమెక్కించినగాని ఫ్రెంచివారిక్కడ నిలుచుటకే యాస్కారముండదు. అప్పుడు ముజఫరుజంగుగారి కుమారుడు పసివాడు. అతనిని సింహాసనమెక్కించినచో అతడు ఫ్రెంచివారికే యుపకారమును చేయలేడు. ఆ శిబిరమునందు నాజరుజంగుగారి సోదరులు ముగ్గురు ఖైదుచేయబడనివారుండిరి. నాజరుజంగుగారు దక్షిణదేశమునకు వచ్చుచున్నప్పుడు వారిని తనవెంటనే బందీలుగా తెచ్చియుండెను. నాజరుజంగు మరణించిన పిమ్మట ముజఫరుజంగు కూడా వారిని ఖైదులోనేయుంచి శిబిరమునందు వెంటబెట్టుకొని వచ్చుచుండెను. ఇప్పుడా సేనయందలి వివిధ సేనానాయకులు వివిధాభిప్రాయము కలవారుగ ఉండిరి. కొందరు పసిబాలుని

పక్షముననుండిరి. కొందరు నాజరుజంగు సోదరులలోనొకరిని తఖ్తునెక్కించవలెనను అభిప్రాయము కలిగియుండిరి.

ఈ సందర్భములో బుస్సీగారు బాగా ఆలోచించెను. ముజఫరుజంగు కుమారుని సంరక్షణము చేయుట యొక ముఖ్యకార్యమనియు, అయితే అతనిని సింహాసనమెక్కించినచో అతని ప్రాణములను కాపాడుట దుస్తరమైన కార్యమగుననియు, అతనిని రక్షించు నెపమునగూడ తగవులు బయలుదేరుననియు, ఎవరు బలవంతులైన వారు అధికారమును, రాజ్యమును చేజిక్కించుకొందురనియు ఈ సంగతులన్నియు చెప్పి నాజరుజంగుగారి సోదరులలో పెద్దవాడైన సలాబత్‌జంగును సుబేదారుగా చేసిన మంచిదనిచెప్పి బుస్సీగారు వివిధ సేనాధిపతులను యొప్పించిరి. పసిబాలుని సింహాసనమునందు నిలిపినచో ఫ్రెంచివారి కతడేలాభమును కలిగించలేడని ఆయన మనస్సులో యున్నమాటను సహజముగా బయల్పరుపక రాజ్యక్షేమలాభమును గూర్చియు, శాంతిభద్రతలను గూర్చియు మాత్రమే చెప్పెను. ఆ శిబిరములోని వారొకరు చెప్పిన మాట ఇంకొకరు వినరు. విజాతీయుడైనను స్నేహపాత్రులైన ఫ్రెంచి గవర్నరు జనరలుగారి ప్రతినిధియైన బుస్సీగారు మధ్యవర్తిగా చెప్పినమాటలు వారికి రుచించెను. ఆ సందర్భమున నతడక్కడివారందరి కెవరికెట్లు చెప్పవలెనో అట్లు చెప్పి యొప్పించెను. ఈ సంగతులు డూప్లేగారికి వ్రాయగా అతడు చాలా సంతోషించెను.

సామదానభేదదండోపాయములను ప్రయోగించుటలో, కార్యసాధనలో, దూరదృష్టిలో బుస్సీగారు డూప్లేగారికి తగిన శిష్యుడనిపించుకొనెను. అంతట అక్కడివారందరును సలాబతుజంగుగారిని సుబేదారుగా నంగీకరించిరి. ఈ పదవి తనకు బుస్సీగారి కృషివలన లభించినదని సలాబతుజంగుగారు సంతోషించి ఫ్రెంచివారిపట్ల కృతజ్ఞుడై ముజఫరుజంగుగారికన్నకూడా హెచ్చుగా వారిని బహూకరించి గౌరవించుటకు నిశ్చయించెను.

సలాబతుజంగుగారు సుబేదారుడగుటతో మరల ఫ్రెంచివారి యాధిపత్యము స్థిరపడెను.

1751 ఫిబ్రవరి నెలవరకును సలాబతుజంగుగారును, బుస్సీగారును తమ సైన్యంతోను పరివారముతోను కడప నవాబుగారి రాజ్యములోనే విడిసియుండి శాంతిభద్రతలను స్థాపించుటకు కృషిచేసిరి. తరువాత మార్చి 15వ తేదీన కర్నూలు నవాబు పట్టణమునకు వచ్చి ఆ నవాబు పాతసుబేదారుగారిపట్ల జరిగించిన ద్రోహమునకు తగినవిధముగా దండించుటకు పూనుకొనిరి. ఈ పట్టణమునకు పఠానులు సరియైన బందోబస్తులు చేయనందున కోటగోడలు, బురుజులు శికస్తుపడియుండెను. ఆ గోడ కొంత నదీప్రవాహమునకు కొట్టుకొనిపోయి పడిపోయెను. కర్నూలులో 4000 మంది పఠానులుండిరి. వారాకోట ద్వారం దగ్గరనుండి నగరమును రక్షించుటకై ప్రయత్నించిరి. కాని ఫ్రెంచివారి ఫిరంగి గుండ్లను, తుపాకీబారులను నెదుర్కొనుటకు వారలవాటుపడినవారుకారు. అందువలన వీరి గుండ్లవర్షమునకు వారు దిగ్భ్రమచెంది త్వరలోనే కోటలోనికి పోయి తలదాచుకొనిరి. డూప్లేగారి దగ్గరనుబంధుడయిన ఒక సేనాధిపతి కొంత సైన్యముతో కోటలో చొరబడి తుపాకులు కాల్చసాగెను. ఇంతలో సలాబతుజంగుగారి సేన అక్కడికివచ్చి అతనికి తోడ్పడి కోట సంరక్షణము చేయువారిని వధించి కోట వశము చేసుకొనిరి. కర్నూలు నవాబుగారి భార్యా, ఇద్దరు కుమాళ్లు ఖైదుచేయబడిరి. పట్టణవాసులు కొందరాయుద్ధమునందు వధింపబడిరి. ఈవిధముగా కొంత బీభత్సముచేసి ముందుగా ప్రజలలో భయోత్పాతము కలిగించినచో అందరును భయభక్తులు కలిగియుందురని వీరు తలంచి యట్లు చేసిరి. అయితే ఫ్రెంచివారందరికి న్యాయము చేయుదురను పేరును సంపాదించుట ముఖ్యమను సంగతి బుస్సీగారెరుగుదురు. అందువలన నతడు అతిత్వరితముగా ఆ వధలను మాన్పించి శాంతిభద్రతలను స్థాపించెను. సుబేదారుగారికి లోబడిన ప్రజలెవ్వరికిని ఏ అపాయము కలుగకుండా ఫ్రెంచివారు రక్షింతురని నగరములో దండోరాపేయించెను. కొందరు చెప్పుకొనిన ఫిర్యాదులు దయగా వినెను. అంతట ఆహా! యీ ఫ్రెంచివారెంత మంచివారని అందరు మెచ్చుకొనిరి. ఈ యుద్దేశముతోనే తమ ప్రాత స్నేహితుడైన ముజఫరుజంగుగారి పసిబాలుని క్షేమలాభముల విషయమై బుస్సీగారు తక్షణమే శ్రద్ధవహించెను. అతని తండ్రిగారి రాజ్యమైన ఆదోని కతని పట్టాభిషిక్తుని చేయించి ఆ రాజ్యములో కర్నూలు నవాబుగారి రాజ్యమును చేర్చి, పెద్దదిగచేసి ఆ బాలునికి మొత్తముపైన సాలుకు పదిలక్షల రూపాయల ఆదాయము వచ్చునట్లు

చేసెను. ఇది చాలా న్యాయముగా నున్నదని శిబిరము లోనివారును ఈ సంగతి విన్నవారును మెచ్చుకొనిరి. ఇందువలన కూడా ఫ్రెంచివారు ధర్మబుద్ధికలవారని ప్రజలలో విశ్వాసము కలిగెను.

తరువాత సలాబతుజంగుగారి సైన్యము కృష్ణానదిని దాటి రాజధానికి పయనమయ్యెను. ఆ సమయమున ఢిల్లీలో సేనాధిపతిగానున్న నాజరుజంగు, సలాబతుజంగుగార్ల అన్నగారైన ఘాజీయుద్దీన్ ఫిరుజుజంగుగారి ప్రోత్సాహముతో 25 వేలమంది మహారాష్ట్ర సైనికులు వచ్చి వీరి సేననెదిరించుటకు సిద్ధముగానుండిరి. దానికధిపతి బాలాజీరావుగారు. బాలాజీరావుగారితో ఘాజీయుద్దీను తియ్యని మాటలు చెప్పి వీరిపైకిపంపినదేగాని వారికంతవరకు ప్రతిఫలము క్రింద రొక్కమునేమాత్రము యివ్వలేదు. అందువలన నితనికి అసంతృప్తిగా నుండెను. ఆ యవకాశము చూచుకొని బుస్సీగారు నేదోయొక యుపాయమును ప్రయోగింపదలచి సలాబతుజంగుగారే నతనికి కొంత సొమ్మిచ్చి మంచి చేసుకొనవలసినదని సలహానిచ్చెను. అతడు ఆ సొమ్ముపుచ్చుకొని వెనుకకు మరలిపోవుటయేగాక సతారాలోని తమ ప్రభువైన షాహురాజుగారికి సలాబతుగారి స్నేహము కుదిరెనని చెప్పెను.

అంతట సలాబతుజంగుగారి సైన్యము ఎట్టి ఆటంకము లేకుండా హైదరాబాదు నగరము చేరెను. 1751 ఏప్రిల్ 2వ తేదీన ఆ పట్టణములో క్రొత్త సుబేదారుగారు మహావైభవముతో ప్రవేశించిరి. అంతట సలాబతుజంగుగారెట్టి చిక్కులను లేకుండా అందరివలనను సుబేదారుగా నంగీకరింపబడిరి. అతడు బహిరంగముగానొక గొప్ప దర్బారును చేసి సన్నద్ లేక సింహాసనమునందాసీనుడై తన క్రింది యుద్యోగుల వలనను, తన ప్రభువుల వలననేగాక చుట్టుపట్ల రాజ్యముల పరిపాలకులవలన గూడ నజరులు, సలాములు స్వీకరించెను.

సలాబతుజంగుగారు తనకు ఫ్రెంచి సైనికదళంవారు చేసిన అమూల్యమైన సేవకు ప్రతిఫలముగా ముఖ్యసేనాధిపతియైన బుస్సీగారికొక లక్షనవరసులనిచ్చెను. అట్లే తక్కిన సేనానాయకులకునిచ్చెను. వారిలో ఎన్‌సైన్ అను చిన్న సైనికోద్యోగికిచ్చిన బహుమతిమొత్తం యేబదివేలరూపాయలుండెను. ఫ్రెంచి కెప్తానులందరికి వారి దుస్తులను సలాబతుజంగుగారే భరించి ఒక్కొక్కరికి నెలకు వెయ్యిరూపాయల చొప్పున జీతమునిచ్చుట కంగీకరించిరి. ఇట్లే

లెఫ్టినెంటులకు నెలకు రూ.500లును ఎన్‌సైనులకు ఒక్కొక్కరికి నెలకు తొంబదిరూపాయలును సామాన్యసైనికుల కొక్కరికి అరువది రూపాయలును జీతములేర్పరచి సొమ్ముమెల్ల తానే భరించుటకంగీకరించెను. మచిలీపట్టణము స్వాధీనము చేసికొనుటలో డూప్లేగారి దూరదృష్టి ఇప్పుడు స్పష్టపడినది. గోలుకొండ హైదరాబాదు సైన్యమునకు కావలసిన కొత్త సైనికులు సరుకులు వగైరా సరంజాము (స్టోరు) ఆయుధసామాగ్రి మొదలయినవానిని సులభముగా పంపుటకు ఆ రేవు చాలా అనువుగానుండెను.

ఈలోపు ఘాజీయుద్దీనుగారు ఢిల్లీ దర్బారు చక్రవర్తిగారి వజీరు మొదలయినవారి వలన దక్కనుసుబేదారీకి తానొక అధికారపత్రమును సంపాదించి తరలివచ్చుచున్నారని వార్తయొకటి వ్యాపించెను. అంతట సలాబతుజంగుగారు గోలకొండనుండి తక్షణమే బయలుదేరి ఔరంగాబాదు నగరమునకు పోయి అక్కడనుండుటకు నిశ్చయించిరి.

సలాబత్‌జంగుగారు మే నెలలో గోలకొండ నుండి తరునాత ఔరంగాబాదుకు తరలి వెళ్లిరి. అక్కడ గొప్ప ప్రభువులు ఆయనకు సుముఖులుగా లేరు. నాజరుజంగు దగ్గిర ప్రధానమంత్రిగా పనిచేసిన షానవాజ్‌ఖాన్‌గారిని ముజఫరుజంగుగారు ఆహ్వానించి అతనికి మరల వజీరుపని నిచ్చియుండిరి. ముజఫర్‌జంగు చనిపోగా షానవాజఖాన్ శిబిరములో నుండి తప్పించుకొనిపోయి ఔరంగాబాదుకు వెళ్లి సలాబతుజంగు అసమర్ధుడనియు కొలదిమంది కాఫర్లకు లోబడి మొగలాయి ప్రభుత్వముయొక్క గౌరవమును, మర్యాదను పోగొట్టినాడనియు అతనిని నిందించి అతని పట్ల ద్వేషము కలిగించెను. పైగా ఫ్రెంచివారాతని రాజ్యములో సగభాగము అపహరించుటకు కుట్ర చేసియున్నారని కూడా అపవాదు వేసెను. అందువలన ఔరంగాబాదు సమీపముననే సలాబతుజంగు తన గౌరవమును, అధికారమును ఢిల్లీ చక్రవర్తిగారు స్థిరపరచినట్లొక నాటకమునాడుటకు నిశ్చయించెను. నిజాముల్ ముల్కుగారి క్రిందనున్న రాజ్యములన్నిటికి తనను సుబేదారునిగ చేయుచు పర్మానా చక్రవర్తిగారొక రాజదూతను పంపినారని సలాబతుజంగు చెప్పుచు ఢిల్లీ నుండి వచ్చిన రాయబారిగా నొకనికి వేషము వేసి ఔరంగాబాదుకు కొంతదూరములోనికి రప్పించి ప్రెంచి సైనికదళముతో సహా తానొక మైలుదూరము వానికెదురేగి

స్వాగతమిచ్చి అతడు చక్రవర్తిగారి దగ్గరనుండి తెచ్చిన లేఖనందుకొని చక్రవర్తిగారినుద్దేశించి వంగి సలాములు చేసి తానా ఫర్మానానందుకొన్నందులకు సూచనగా తన సైన్యమున గల ఫిరంగులను, తుపాకులను అన్నింటినొక్కమారుగా ప్రేల్పించెను. తరువాత నతడొక గొప్ప దర్బారును తీర్చెను. ఆ దర్బారులో మొట్టమొదట బుస్సీగారే యాయనకు వంగి సలాముచేసి నజరు సమర్పించిరి. తరువాత సలాబతుజంగు గారి సైన్యము ముందుకు సాగి ఔరంగాబాదు నగరమున మహావైభవముతో ప్రవేశించిరి.

ఔరంగాబాదు చాల గొప్ప నగరము. అందులో పదిన్నర లక్షల జనసంఖ్య యుండెనని ఆకాలమునందు అంచనా వేయబడినది. ఫ్రెంచి సైనికులను ప్రత్యేకముగ నొకచోట నుండుటకు విడిది యేర్పాటుచేసిరి. ఢిల్లీ చక్రవర్తి సలాబతుజంగు అన్నగారైన ఘాజీయుద్దీన్ గారిని దక్కను సుబేదారుగా నంగీకరించెనని చాలమందికి తెలియును. అందువల్ల నిప్పుడీ సలాబతుజంగు తానే దక్కను సుబేదారుడనని ప్రకటించినట్లు విన్నప్పుడు వారు ఆయన అధికారమునకు తాము లోబడి ప్రవర్తింపదలపలేదు. అయినప్పటికిని ఇంతగొప్ప వైభవముతో వచ్చి తమ నగరములో ప్రవేశించి దానిని తన రాజధానిగా చేసికొనెదనని ఇతడు ప్రకటించి రాజలాంఛనములన్నియు వహించియుండగా ఆ క్రొత్త సుబేదారుని దర్శించుటకు వారికి కుతూలహము కలుగుటలో నాశ్చర్యములేదు. పైగా తమనగరమును రాజధానిగా చేసుకొని ప్రభుత్వము చేయుచున్నప్పుడు వారు సంతోషముతో నుప్పొంగుటలోను ఆశ్చర్యములేదు. అందువలన ఈ క్రొత్త సుబేదారుగారు అధికారము వహించిన సందర్భములో నగరమునందు జరుగుచున్న ఉత్సవములందును కోలాహలమునందును ప్రజలు నిమగ్నులై ఘాజీయుద్దీను మాటనే తలపెట్టలేదు. క్రమక్రమముగా అందరును ఘాజీయుద్దీన్ మాటను మరచిపోయి సలాబతుజంగునే దక్కను సుబేదారుగా నంగీకరించి యతని అధికారమునకు లోబడి అతనికి పరిపాలనలో తోడ్పడసాగిరి.

ఆ సంవత్సరాంతము వరకును సలాబతుజంగుగారు ఔరంగాబాదులోనే యుండి యెట్టి యుద్ధపు బెడదలును లేకుండా తన ప్రభుత్వ వ్యవహారములను చక్కబెట్టుకొనసాగిరి. సలాబతుజంగు భోగ ప్రియుడు. అందువలన తన రాజభవనమునందు గొప్ప విందులు, మేజువాణీలు జరిపిచుచూ

వినోదములందు, భోగములందును ప్రొద్దుపుచ్చుచు సుఖముగా కాలము గడపసాగెను. తరువాత కూడా సలాబతుజంగు హైదరాబాదు కన్న ఔరంగాబాదులోనే హెచ్చుగా నివసించుచుండెను.

(సమాప్తం. ఆంధ్రప్రభ సెప్టెంబరు 1968-ఫిబ్రవరి 1969)